Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కడుపు నిండిన తరువాత

పంపినవారు:
ఎస్. హెచ్. రావు - తెనాలి.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


LIFEBUOY
SOAP
LIFEBUOY
SOAP

# Books for the Family entertainment

| | | |
|---|---|---|
| Thandri Kodukulu<br>*(in Telugu & Tamil)* | 34 pages | Rs. 0.50 a copy |
| Aidu Prashnalu<br>*(in Telugu, Tamil & Kannada)* | 44 ,, | Rs. 0.37 ,, |
| Jathaka Kathalu<br>*(in Telugu & Kannada)* | 86 ,, | Rs. 0.75 ,, |
| Vichitra Kavalalu<br>*(in Telugu, Kannada, Hindi, Marathi, Tamil & Oriya)* | 116 ,, | Rs. 1.00 ,, |



*Stories serialised in 'Chandamama' issued in attractive book forms...*



OBTAIN YOUR LANGUAGE COPY FROM YOUR LOCAL AGENT OR WRITE TO US



*Book Dept.*

**CHANDAMAMA PUBLICATIONS**

**MADRAS-26**

# పాఠకుల లేఖలు

## మార్చి 1961

అందచందాలమామ మా చందమామ
చక్కని కథల మామ మా చందమామ
డెందమానందపరచు మా చందమామ
సాటియేలేని మామ మా చందమామ

—కె. రాధాకృష్ణ, కణేకల్

"జ్వాలాద్వీపం" జంకుగొంకులేక, వినేవారికి సొంపుగా, చదివేవారికి ఇంపుగా, తన్మయత్వం చెందే చిత్రములతో ముందుకు సాగిపోతూంది. ....రచయితకు అభివందనములు.

—సి. ఎస్. విజయకుమారరెడ్డి, ఆలువాల

"చందమామ" ఏ నెల కానెల అందమైన బొమ్మలతో చిత్రకథలతో ఆకర్షిస్తోంది. ముఖ్యముగా "జ్వాలాద్వీపం" చాలా బాగుంది. "కొయ్యగుర్రం" కూడ చాల బాగుంది.

బెండపూడి శారద, చొప్పెల్లి

"మాలతీమాధవం", "పిశాచాల జేగంట", "కొయ్యగుర్రం" చాలా బాగుగా ఉన్నవి.

—ఉషాకుమారి, మద్రాసు

"కుమణుడి ఔదార్యం", "పిశాచాల జేగంట" బాగుంది. ఇటువంటి కమ్మని కథలను ప్రచురిస్తున్నందుకు నా కృతజ్ఞతలు.

ఏ. ఎల్. సుబ్రమణ్యం, గుడియాత్తం

"చందమామ" దినదిన ప్రవర్ధమానము అగుచున్నది "పిశాచాల జేగంట", లంకెబిందెలు", "రైతు పెట్టుకున్న అర్జీ" చాలా బాగున్నవి. సీరియలులు "జ్వాలాద్వీపము", "కొయ్యగుర్రము" చాలా బాగున్నవి.

—తిపిర్నేని సుభాష్చంద్రబోసు,
నాగార్జునసాగర్

"కొయ్యగుర్రం", "శమంతకమణి" చాలా బాగున్నాయి. శ్రీ వ. పా. గారి అట్టమీది బొమ్మ "చందమామ" అందమును రెట్టింపు చేసింది.

—కరుసోది రాజకమల్‌కుమారి,
విశాఖపట్నం

"మాలతీమాధవం" "పిశాచాల జేగంట", "రైతుపెట్టుకున్న అర్జీ", మిగిలిన కథలుకూడా చాల బాగున్నవి.

—జి. పరిమళాబాయి, సామెహళ్లి

"పిశాచాల జేగంట", "లంకెబిందెలు" చాలా బాగున్నవి. "కొయ్యగుర్రము" ప్రచురించిన ఎడిటర్‌గారికి, రచయితకు నా అభివందనములు.

—కుమారి ఎస్. నాగమణి, బిట్రగుంట

"తాతయ్య కథలు" చాలా బాగున్నవి. శేషాద్రి గారికి నా అభినందనలు. "కుముఖుని ఔదార్యం" చాలా బాగున్నందులకు సంతసించుచున్నాను.

—డి. రామ్‌చందర్, మంచిర్యాల

"కొయ్యగుర్రం" కథ చాలా బాగున్నది. చదువుచున్నంతసేపు ఎంతో ఆనందముగా ఉన్నది.

—పి. శ్యామసుందరప్రభు, ఎమ్మిగనూరు

"ముగ్గురు పెళ్లికొడుకులు" "లంకెబిందెలు" నా కెంతగానో నచ్చినవి. "కొయ్యగుర్రం" రచయిత సి మాధవరావుగారికి నా ధన్యవాదాలు.

—వై. ఉమాకాంతరావు, కటకం

"చిలుకపలుకులు", లంకెబిందెలు", "ముజో కోసం" కథలు చాలా బాగున్నవి. ఇలాటి కథలే వేస్తారని ఆశిస్తున్నాను.

—కె. వేణు, నెల్లూరు

మహాభారతం, దాసు-వాసుల చిత్ర కథలు చాలా బాగున్నాయి. "శమంతకమణి" రచయిత నశ్యో నారాయణాచార్యగారికి నా అభినందనలు.

—వి. రజనీపుష్పలత, కాళహస్తి

తెలుగు బాల లందరిని మురిపిస్తూ, మంచి కథలను అందిస్తూ, విజ్ఞానమునకు, వినోదమునకు పట్టుకొమ్మ అయిన "చందమామ" చిరకాలం వర్ధిల్లాలి.

—శింగలూరి బాపిరాజు, కొవ్వూరు

# యువ

సచిత్ర మాస పత్రిక



మార్చి సంచికలో

| | | |
|---|---|---|
| దేవి | — | మద్దిపట్ల సూరి |
| ఆత్మపరిశీలన | — | శాయన్న |
| అర్థమున్న కథ | — | అవసరాల రామకృష్ణ |
| జోస్యం నిజమయింది | — | పాలంకి రామచంద్రమూర్తి |
| ఆడపిల్ల తండ్రి | — | తాళ్ళూరి నాగేశ్వరరావు |
| ప్రేమగత ప్రాణులు | — | ఇసుకపల్లి దక్షిణామూర్తి |

ఇంకా....పనిలేని మంగలి, మరోప్రపంచం, చీకటిగదులు వగైరా



కాపీకి మీ ఏజంటు నడగండి

| విడి ప్రతి | సాలు చందా |
|---|---|
| రు. **0-75** | రు. **9-00** |

## యువ కార్యాలయం

పబ్లిక్ గార్డెన్ రోడ్ :: హైదరాబాదు-1.

# ఇప్పుడు
## మీకు ప్రియమైన ఆరోగ్యముచేకూర్చే విటమినులు కలిసిన వాటర్‌బరీస్ కాంపౌండ్ తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్చబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.

తెల్లని రంగుగల మూత ఉన్నదా అని చూడండి

Waterbury's VITAMIN Compound




## వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తి చేయును.

దగ్గు, జలుబులకు క్రియోసోట్ మరియు గ్వయకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎర్ర లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



మనోహరమైన
ముఖలావణ్యమునకు

నేషనల్ వారి
# కాశ్మీర్ స్నో








సినిమా
తార లందరకు
నచ్చినది

దీ నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 • మదరాసు-1

---

# నోపిన్ పెద్ద ట్యూబు కొని
# డబ్బు ఆదా చేయండి !






ఒక పెద్ద ట్యూబు మూడు చిన్న ట్యూబులకు సమానము.




నోపిన్ మర్దనా చేసిన వెంటనే చర్మపు లోపలి భాగమందు బాగా లోతుగా ప్రవేశించి, అప్పటినుండి అదనపు రక్తమును పైకి తీసికొని వచ్చి, నంది పోయి నిచ్చే




వేడి పుట్టించి, ఆ వేడివల్ల నెప్పిని పోగొట్టుతుంది.
నోపిన్ కుటుంబమువారికం అటే వస్తుంది.
నోపిన్ పరిశుభ్రమగు ట్యూబులలో నింపబడి సీలువేయుట వలన, అందున్న దినుసుల శక్తి క్షీణించక, శక్తి కాకుండా ఉండి, దానిని ఎల్లప్పుడు బలంగాను, సువాసనతోను ఉంచును.
ఎల్లప్పుడు ఒక నోపిన్ ట్యూబును అందుబాటులో ఉంచుకొనుడు.

దీ కలకత్తా కెమికల్ కం. లి.,
కలకత్తా-29



దక్షిణ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

భవభూతి రచించిన "ఉత్తరరామ చరిత" నాటక కథను "సీతా వనవాసం" అన్న పేరుతో—వడ్డాది పాపయ్య వాష్ డ్రాయింగులతోసహా—ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

"కిరాతార్జునీయం" రచించిన, మహాకవి భారవి జీవితానికి సంబంధించిన ఒక ఘటనకూడా మీరు ఈ సంచికలోనే చదువుతారు.

"పాఠకుల లేఖలు" శీర్షికకు అధిక సంఖ్యలో "చందమామ" పై ప్రశంసలు వచ్చాయి. నెల నెలా "చందమామ"లో వెలువడే శీర్షికలలోనూ కథలలోనూ పాఠకుల ఆదరాన్ని పొందుతున్నవేవో, పొందలేకపోతున్నవేవో తెలుసుకోవటానికే ఈ శీర్షిక ప్రవేశపెట్టాం. దానిని పాఠకులు సరిగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.

సంపుటి 28 : మార్చి 1961 : సంచిక 3




# ఉషస్సు

సృష్టి జరిగినప్పుడు జలంలోనుంచి భూమి పైకి వచ్చింది. భూమిపై జీవరాసులన్నీ పుట్టాయి. కాని సూర్యుడు లేని కారణంచేత ప్రాణులన్నీ అంధకారంలో ఉండిపోవలసి వచ్చింది.

మనుషులకు క్రూరజంతువుల బాధ హెచ్చుగా ఉన్నది.

చీకటి మూలాన వాళ్ళు పనులు చేసుకోలేకుండా ఉన్నారు.

ఇలా కొంతకాలం జరిగిన తరవాత, మనుషులలో జ్ఞాని అయినవాడొకడు మిగతావారితో ఇలా చెప్పాడు:

"బ్రహ్మదేవుడు మిగిలిన సృష్టితోబాటు సూర్యభగవానుణ్ణి కూడా సృష్టించాడు. మనలో ఎవరైనా బయలుదేరి వెళ్ళి ఆ సూర్యభగవానుణ్ణి ప్రార్థించినట్టయితే ఆయన అనుగ్రహించి తన కాంతిని మనకు ప్రసాదిస్తాడు. అప్పుడు మనకు వెలుగూ, వేడీ లభిస్తాయి. క్రూరజంతువుల బాధ తప్పుతుంది. మనం హాయిగా మన పనులు చేసుకోగలుగుతాం!"

ఈ ఆలోచన అందరికీ నచ్చింది. కాని సూర్యభగవానుణ్ణి ఆహ్వానించటానికి ఎవరు వెళ్ళేట్టు?

అరవైఏళ్ళ తాత ఒకడు, "నాయనలారా, నేను పెద్దవాణ్ణయిపోయాను. నా వల్ల మీకెవరికీ కొంచెంకూడా లాభంలేదు. కాని నా కాళ్ళలో ఇంకా శక్తి ఉన్నది. నేను సూర్యభగవానుడి దగ్గిరికి వెళ్ళి, పని పూర్తి చేసుకు వస్తాను," అన్నాడు.

దానికి ఒక పడుచువాడు, "తాతా, ఇది ముసలివాడి వల్ల జరిగే పని కాదు. ప్రయాణం ఎంతకాలం పడుతుందో ఎవరూ చెప్పలేరు. నేను బయలుదేరి వెళతాను. దారిలో ఏ కష్టాలు ఎదురైనా తట్టుకోగలను," అన్నాడు.

ఎ. ధర్మారావు

అప్పుడు ఒక కుర్రవాడు ఇలా అన్నాడు: "ఈ ప్రయాణం చాలాఏళ్ళు పడుతుంది. నేను పదేళ్ళవాణ్ణి. నన్ను పంపినట్టయితే నేను ముసలివాణ్ణి అయేలోపుగా అయినా సూర్యభగవానుణ్ణి చేరుకోగలుగుతాను. మీలో ఎవరికీ ఈ దూరప్రయాణం పూర్తి చేసే అవకాశం లేదు."

అందరూ ఆ కుర్రవాడి మాటలలు శ్రద్ధగా విని, ఆ చెప్పిన దాంట్లో కొంత నిజం ఉన్నదని గ్రహించారు.

అప్పుడు జనంలో నుంచి ఒక ఇరవై ఏళ్ళ స్త్రీ ఇలా అన్నది: "నామాట కాస్త వినండి. మీరంతా పెరటి దారిన్నే ఉన్నారు. ఇది ఒక తరంలో జరిగే పని కాదు. నన్ను వెళ్ళనివ్వండి. నా గర్భంలో ఒక పిల్లవాడు పెరుగుతున్నాడు. నే నెలాగూ సూర్యభగవానుణ్ణి చేరుకోలేను. కాని దారిలో పుట్టే నా కొడుకుకైనా, కొన్నాళ్ళ తరవాత ఆ అవకాశం ఉంటుంది!"

ఆ ఆడమనిషి పేరు ఉషస్సు. ఆమె చెప్పిన మాటలు అందరికీ అంగీకారమయాయి. ఆమె ప్రయాణమైపోతూ, "నేను వెళ్ళిన దిక్కే చూస్తూ ఉండండి. వెళ్ళిన పని సానుకూలం కాగానే ఒక పెద్ద మంట వేస్తాను, లేదా నా కొడుకుచేత వేయిస్తాను. ఆ మంట చూడగానే మీకు సూర్యభగవా



నుడు అనుగ్రహించినట్టు తెలిసిపో తుంది," అన్నది.

ఆమె ఒక దిక్కుగా బయలుదేరి ముక్కు సూటిగా నడిచింది. ఆమె అలా ఎనిమిది మాసాలు ప్రయాణంచేసి దారిలో ఒక కొడు కును కన్నది. తరవాత ఇద్దరూ కలిసి ప్రయాణంచేశారు.

ఉషస్సు బయలుదేరి డెబ్భై సంవత్సరా లయింది. ఆమె చాలా ముసలిదయింది. ఆమె తన కొడుకుతో, "నాయనా, ఇక నేను నడవలేను. మిగిలిన ప్రయాణం నువే పూర్తిచెయ్యి. సూర్యభగవానుడు అనుగ్ర హించాక పెద్ద మంట వెయ్యి, దాన్నిచూసి మనవాళ్ళు సంతోషిస్తారు!" అని చెప్పింది.

ఉషస్సు చెప్పిన మంట కోసం ప్రజలు ఆమె వెళ్ళిన దిక్కుగా చూస్తూ కాచుకుని ఉన్నారు. ఆమె బయలుదేరిన నూరు సంవత్సరాలకు ఆ దిక్కుగా ఎర్రని కాంతి కనపడింది. జనం పరమానందభరితులై, "అదుగో మన ఉషస్సు! పని పూర్తి అయింది. ఇక మన కోసం సూర్యభగవా నుడు ఉదయిస్తాడు!" అని అప్పటికప్పుడే పనులు ప్రారంభించారు. తరవాత కొద్దిసేప టికే సూర్యుడు ఉదయించి ప్రజలకు కాంతినీ, సుఖాన్నీ, ఆనందాన్నీ, ఆరోగ్యాన్నీ ప్రసాదించాడు.

ఈనాటికీ పనులు చేసుకునేవారు ఉషస్సు కోసం ఆమె వెళ్ళిన దిక్కుగా చూస్తారు. అదే తూర్పు. ఉషస్సు కనిపించ గానే పనులు సాగిస్తారు, సూర్యుడు వచ్చే దాకా ఆగరు.

అంతేగాక మనుషులు ఉషస్సు నుంచి ఇంకొక విషయంకూడా తెలుసుకున్నారు. అదేమిటంటే, మనుషులు మహత్తరమైన పనులు సాధించాలంటే అది ఒక మనిషి వల్లా, ఒక్కతరంలోనూ సాధ్యంకాదు; అనేక తరాలవారు దీక్షవహించి అటువంటి పనులు సాధించాలి.





# శమంతకమణి

తృతీయాశ్వాసము :

ఒక్కనాడు ప్రసేనుండు
చక్కగా శమంతకమును
తాల్చి గొప్ప గుఱ్ఱమెక్కి
తరలినాడు వేటాడగ.

వేటకాండ్రు వానివెంట
విల్లమ్ములు వలలు దాల్చి
బహుదూరపు టడవులకును
బయలుదేరి పోయినారు.

గంటల మ్రోగించువారు,
మంటల రగిలించువారు,
పరుగులెత్తు మృగములపై
బాణాలను వైచువారు—

వేటకాండ్రు చేయు రొదకు
వెఱచినట్టి సివ్వంగులు
తోక ముడిచి మెలమెల్లగ
తొక్కటపడి తిరుగుచుండె.

అటునిటు పరుగెత్తు లేళ్ళు
ఆ మంటల బడుచుండెను;
గుండె గఱచుకొని యుండిన
కూనలతో కోతులుండె.

ఏమి కనెనో, ప్రసేనుండు
ఎక్కినట్టి గుఱ్ఱ మపుడు
భయపడి పరుగెత్తసాగె
బహుదూరపు టడవులకును.

గుఱ్ఱ మట్లు తత్తరపడి
గుండె లవియ కాళ్ళు వణక
నోట నురుగు జారుచుండ
నూరామడ పరుగెత్తెను.

అంతలోన ఒక సింహము
ఆ శమంతకమును చూచి
పొదలచాటునుండి దూకి
బొబ్బరించి పైన బడెను.

ఉత్పల సత్యనారాయణాచార్య

ఒక దెబ్బకు పైవానిని
ఒఱగిపోవునట్లు కూల్చి,
పరుగెత్తెడు గుఱ్ఱమ్మును
పట్టి చంపె ఆ సింహము.

మణిని నోట గఱచి పట్టి
మఱికొంచెము దూరమేగి
రత్నమ్మును నాకుచుండె,
అక్కుచుండె ఆ సింహము.

అంత జాంబవంతు డొకడు
అంతులేని బలవంతుడు
సింహముతో కలియబడెను,
చిటికలోన హతమార్చెను.

ఆ మణి గొని ఎలుగుఱేడు
ఆనందము పొందినాడు,
వెనుకచూపు చూచుకొనుచు
తన బిలమున కేగినాడు.

సుకుమారుండనెడి తనదు
సుతునకా శమంతకమును
ఆడుకొనగ నిచ్చినాడు,
అచట వ్రేలగట్టినాడు.

—అచ్చట నా వేటకాండ్రు
అడవియెల్ల వెదకి వెదకి,
ఎచ్చటను ప్రసేను గనక
ఏగినారు తమ నగరికి.

ఎన్నాళ్ళకు తన తమ్ముడు
ఇంటికి రాకుండుట గని,
మణి కోసము వాని నెవరొ
మట్టు పెట్టి యుందు రనుచు—



శ్రీకృష్ణుడె ఇంత పనిని
చేసియుండు, నింకెవరును
మణి నడిగినవారు కారు,
మాయచేసి చంపలేరు;

అని సత్రాజితుడు తనదు
అప్తులకును చుట్టాలకు
చెప్పుచుండ, ఆ సంగతి
శ్రీకృష్ణుని చెవిని బడెను.

"అయ్యో! నేనేమి యెఱుగ,
అపనిందల పాలైతిని;
ఏరీతిగ ఈ నిందను
వారింతును ఇకమీదట?

మణిని గోరి సత్రాజితు
మనసును నొప్పించినాడ;
కులములోన అపవాదును
కోరి తెచ్చుకొన్నాడను."

శ్రీకృష్ణుం డీవిధముగ
చింతించుచు, ఆ ప్రసేను
డేమయ్యెనొ తెలిసికొందు
ఈసడి పోగొట్టుకొందు—

అని తలంచి తన బంధుల
నందఱ రప్పించి చెప్పి,
తొల్లటి యా వేటకాండ్ర
తోడ్కొని తానేగినాడు.

వింధ్యపర్వతారణ్యము
వెదకి వెదకి, ఋక్షవంత
గిరి గహనములందు జొచ్చి
తిరిగి తిరిగి వెదకుచుండ—





ఒక చోట ప్రసేను శవము
ఒఱగిపోయి పడియున్నది;
శవము చుట్టు రాబందులు
చాలుపుగా కూర్చున్నవి.

గుఱ్ఱపు జీనొక్క చోట
గుఱ్ఱము వేఱొక్క చోట
అగుపించగ శ్రీకృష్ణుడు
అచటి కేగి చూచినాడు.

రౌతుకడను వెదకినారు,
రత్నము కనిపించలేదు;
అంతటితో కృష్ణుడు తన
యత్నము చాలించలేదు.

మఱికొంచెము దూర మేగి
పరిసరముల చూచినాడు;
పెద్ద సింహ మొక తావున
పీనుంగయి పడియుండెను.

దాని చెంత చూచినాడు,
మానిక మగుపించలేదు;
కాని, ఒక్క భల్లూకపు
కాలిగుర్తు లగుపించెను.

ఆ యడుగుల జాడ బట్టి
అరిగినాడు శ్రీకృష్ణుడు;
అచ్చట నొక పెద్ద బిలము
ఆవులించి నట్లున్నది!

బిలము చెంత వేటకాండ్ర
నిలిపి, తాను ఒంటరిగా
ఆ చీకటి కొనలోని
కరిగినాడు శ్రీకృష్ణుడు.

గుహలోపలనుండి తిరిగి
గోవిందుడు ఎపుడెప్పుడు
వచ్చునో! యని వేటకాండ్రు
వాకిట నిలబడియుండిరి. —(సశేషం)






## 15

[పదిహేను సంవత్సరాల కాలం గడిచిపోయింది. ఇప్పుడు ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులైన రుద్రారుద్రులూ ఇరవై ఏళ్ల యువకులు. వాళ్లు ఒకనాడు అడవిలో తిరుగుతూండగా, ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. వాళ్ళు ఆమె రక్షణకోసం వెళ్ళేసరికి, పులిరాయుళ్ళు వాళ్ళను పట్టుకుని బంధించి భయంకర పక్షులకేసి లాక్కుపోయారు. తరవాత—]

హఠాత్తుగా కనురెప్పపాటు కాలంలో జరిగిపోయిన ఈ దుస్సంఘటన ఉగ్రదత్తుణ్ణి నిశ్చేష్టుణ్ణి చేసింది. తనూ, తన స్నేహితులూ ముందువెనుకలు ఆలోచించకుండా సరాసరి శత్రువులు పన్నిన ఉచ్చుల్లో తలదూర్చి, వాళ్ల చేజిక్కారు. 'రక్షించండి' అంటూ ఆర్తనాదం చేసిన, ఆ యువతికూడా ఈ దుర్మార్గుల పాలబడి వుంటుందా? లేక వీళ్ల బారినుంచి తప్పించుకుని కోటకేసి పారిపోయి వుంటుందా?

ఆ యువతి సురక్షితంగా యిక్కణ్ణించి తప్పించుకు పోగలగటం అసంభవం అని ఉగ్రదత్తుడికి వెంటనే తోచింది. ఆవిడ పెట్టిన కేకలూ, పులిరాయుళ్లు చేసే అట్టహాసాలూ విని, ఎవరైనా కోటలోనుంచి బయటకు వస్తేతప్ప, తమకు ఈ దుర్మార్గుల నుంచి రక్షణలేదు.

"రుద్రా!" అంటూ ఉగ్రదత్తుడు కేక పెట్టాడు. అతడికి తన స్నేహితు లెక్కడున్నారో తెలియటంలేదు. ఇద్దరు పులి




రాయుళ్ళు అతణ్ణి కొయ్యేదుంగ మాదిరిగా భుజాన వేసుకుని పక్షిమీదికి ఎక్కించేందుకు ప్రయత్నిస్తున్నారు.

"ఉగ్రదత్తా! నా కాళ్ళూ చేతులూ కట్టి నన్ను భయంకర పక్షిమీదికి ఎక్కించారు. ఆరుద్రుడుకూడా, ఈ దుర్మార్గులకు దొరికి పోయాడు. నువ్వూ చిక్కిపోయావా ?" అంటూ రుద్రుడు కేక పెట్టాడు.

"నోళ్లు ముయ్యండి!" అంటూ ఒక పులిరాయుడు పెద్దగా అరిచి, "మనకు ముచ్చటగా దొరికిన ఈ ముగ్గురూ మహ పసందైన మూర్ఖుల్లా వున్నారు. ఇక ఆ సామంత రాజు సుదర్శనుడి కూతురు చంద్రసేన తెలివితేటలెలాంటివో తెలుసుకోవాలి," అంటూ హేళనగా నవ్వాడు.

ఆ పులిరాయుడి మాటలవల్ల ఉగ్రదత్తుడికి, ఆ యువతి ఎవరో తెలిసిపోయింది. వాడు విజయగర్వంతో పళ్ళు మరిచి, తనకు అడక్కుండానే ఆమె సమాచారం అంతా చెప్పేశాడు. బహుశా ఈ పులిరాయుడూ మూర్ఖుడే అయివుంటాడు; అనుకున్నాడు ఉగ్రదత్తుడు.

ఇంతలో కోటవైపు నుంచి పెద్ద కలకలం వినబడింది. గుర్రాల సకిలింపులూ, రౌతులు పెట్టే కేకలూ వింటూనే, ఉగ్రదత్తుడు తమకు సహాయం వస్తున్నదనుకున్నాడు. రాజకుమార్తె చంద్రసేన పెట్టిన కేకలు కోటలోవాళ్ళకు వినబడివుంటవి. తనను బంధించిన తాళ్ళు తెగగొట్టుకోగలిగితే ఎంత బావుండును!

ఉగ్రదత్తుడు, కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ పెనగులాడటం ప్రారంభించేసరికి, ఒక పులిరాయుడు భీకరంగా అరుస్తూ, అతడి గుండెలమీద ఈటె అనించి, "కదిలావో, ఈటె గుండెలోకి దిగుతుంది, జాగ్రత్త!" అన్నాడు. అవెంటనే భయంకర పక్షి రివ్వున గాలిలోకి లేచింది. ఉగ్రదత్తుడు ఆ ఊపుకు పక్షిమీద అటూయిటూ వూగిసలాడుతూ,



"సమయం మించిపోయింది. ఈ క్రూరులు మమ్మల్ని జ్వాలాద్వీపం తీసుకు పోతున్నారు," అనుకున్నాడు.

చూస్తూండగానే భయంకర పక్షులు ఆకాశంలోకి చాలా ఎత్తు ఎగిరి మేఘాల మీదుగా తూర్పుదిశకేసి పోసాగినై. పక్షుల వేగానికి గాలి రివ్వురివ్వుమంటూ ఉగ్రదత్తుణ్ణి తాకసాగింది. అతడు పక్షి వెన్ను మీద అటూయిటూ ఒరుగుతున్నాడు. జారి కిందికి పడిపోకుండా ఒక పులిరాయుడు అతడి నడుం గట్టిగా పట్టుకున్నాడు.

ఇలా కొద్దికాలం జరిగింది. పక్షులు క్రమంగా కిందికి దిగుతున్నట్టు ఉగ్రదత్తుడికి తోచింది. గాలి హఠాత్తుగా వేడెక్కిపోయింది. శరీరాన్ని ఏవో మంటలు తాకుతున్నట్టుగా అతడు భ్రమపడ్డాడు. అంతలో, "శత్రువులు! భల్లూకరాయుళ్ళు! చంద్రసేనా, ఇతర బంధితులూ వున్న పక్షుల్ని జాగ్రత్తగా కిందికి చేర్చండి. తతిమ్మావాళ్ళు భల్లూకరాయుళ్ళను ఎదుర్కోండి!" అన్న కేక వినబడింది.

"ఓహో! జ్వాలాద్వీపంలో కూడా రెండు శత్రుపక్షాలున్నవన్నమాట!" అనుకున్నాడు ఉగ్రదత్తుడు. ఈ సంగతి తెలియగానే అతడికి ఎక్కడలేని ఉత్సాహం కలిగింది.



కాని, వాళ్ళూవాళ్ళూ భయంకర పక్షులమీద ఆకాశంలో చేసే యుద్ధంలో, నేనూ, నా మిత్రులూ కింద పడి ముక్కలు ముక్కలై మరణించంగదా? అన్న భయంకూడా అతడికి కలిగింది.

హఠాత్తుగా ఉగ్రదత్తుడున్న భయంకర పక్షి మెడ సాచి భూమిమీదికి వేగంగా దిగసాగింది. ఉగ్రదత్తుడు తల ఎత్తి పైకి చూశాడు. ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించి, పెద్ద పెద్ద ఈటెలు పట్టుకునివున్న కొందరు, తాము ఎక్కివున్న భయంకర పక్షులను పులిరాయుళ్ళ మీదికి ఉసికొల్పుతున్నారు. చూస్తూండగానే ఆకాశంలో పులిరాయుళ్లకూ




భల్లూకరాయుళ్ళకూ భయంకర యుద్ధం ప్రారంభమయింది. ఈ దెబ్బలు తిని, బాధతో మూలుగుతూ కొందరు రౌతులు పక్షులమీదినుంచి కిందికి పడసాగారు. రౌతులను కోల్పోయిన పక్షులు, రెక్కలు టపటపలాడిస్తూ, కేకలుపెడుతూ అన్ని దిక్కులకూ పారిపోతున్నవి.

ఇంతలో ఉగ్రదత్తుడున్న పక్షి ఒక కొండ పైభాగాన దిగింది. ఆ పక్షిమీద వున్న ఇద్దరు పులిరాయుళ్ళూ కిందికి దిగి, ఉగ్రదత్తుణ్ణి పక్షిమీది నుంచి ఎత్తి, చాపచుట్టను పారవేసినట్టు కిందికి విసిరివేశారు. అదృష్టవశాత్తూ అతడు ఎత్తుగా పెరిగిన పచ్చగడ్డీ, దుబ్బు



చెట్లూ వున్నచోట పడటంతో, శరీరానికి పెద్ద గాయాలేమీ తగలలేదు. కాని, అతడికి ప్రాణం కడబట్టినంత పనయింది.

ఒక పులిరాయుడు అతణ్ణి సమీపించి కాలితో అటూయిటూ కదిలించి చూస్తూ, "వీడు చచ్చినట్టున్నది!" అన్నాడు. అందుకు రెండవ పులిరాయుడు పెద్దగా నవ్వి, "వీడు బతికివున్నా, చచ్చినా మనకు ఒకటే. రాజకుమార్తె సురక్షితంగా మన నాయకుడి భవనం చేరింది. వీడి సంగతి తరవాత చూద్దాం. ముందు కంధుడి అనుచరుల పని తేల్చాలి, రా," అంటూ భయంకర పక్షికేసి పరిగెత్తాడు.

పులిరాయుళ్ళ సంభాషణ ఆలకిస్తూ, ఉగ్రదత్తుడు కదలా మెదలక పూరుకున్నాడు. తను బతికివున్నట్టు వాళ్ళకు అనుమానం కలిగితే, ఒకవేళ వాళ్ళు తనను చంపవచ్చు. కంధుడనేవాడు ఈ పులిరాయుళ్ళకు శత్రువులైన భల్లూకరాయుళ్ళకు నాయకుడు. సామంతరాజు సుదర్శనుడి కుమార్తె చంద్రసేనను పులిరాయుళ్ళు క్షేమంగా తమ నాయకుడి ఇంటికి చేర్చారు.

తన కాళ్ళూ చేతుల్నీ కట్టివున్న తాళ్లను తెగగొట్టుకునేందుకు ఉగ్రదత్తుడు గట్టి





సూర్యుడు క్రమంగా ఆకాశం మధ్యకు వచ్చాడు. ఎండ తీవ్రమయింది. ఉగ్రదత్తుడి నాలుక దాహంతో పిడచకట్టుకు పోసాగింది.

"ఆకలితో, దాహంతో బాధపడి నేనిక్కడ మరణించక తప్పదు," అనుకున్నాడు ఉగ్రదత్తుడు. తనను అక్కడ వదిలి పోయిన శత్రువులు వచ్చినా, తన ప్రాణానికి కొంత రక్షణ కలగవచ్చునన్న భావం అతడికి కలిగింది. వాళ్ళు తన సంగతే మరిచి పోయారా? లేక భల్లూకరాయుళ్ళతో జరిగిన యుద్ధంలో మరణించారా?

ప్రయత్నం చేశాడు. కాని, అతడి పెనగులాటవల్ల తాళ్ళు మరింతగా బిగుసుకు పోయి, ఎక్కడలేని బాధా కలిగించినై. "ఇక నేను చేయగలిగిందేమీ లేదు. ఎవరైనా వచ్చి నన్ను రక్షించవలసిందే. బహుశా రుద్రారుద్రులు కూడా నేనున్న నిస్సహాయ స్థితిలోనే వుండివుంటారు," అనుకున్నాడు ఉగ్రదత్తుడు నిస్పృహగా.

ఆకాశంలో మరో పావుగంటకాలం ఇరు పక్షాల మధ్య భయంకర యుద్ధం సాగింది. చివరకు కొన్ని పక్షులు పడమటిదిక్కుగా పారిపోతూండటం, వాటిని తరుముతూ మరికొన్ని వెళ్ళటం ఉగ్రదత్తుడు చూశాడు.

ఉగ్రదత్తుడు యిలా మథనపడుతూన్నంతలో, పక్కనే వున్న చెట్లలో ఏదో అలికిడి అయినట్టు అతడికి అనుమానం కలిగింది. ఉన్నచోటునుంచి, ఆ ధ్వని వచ్చిన వైపుకు పొర్లి, చెట్లలోకి పరీక్షగా చూశాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతడికి భీతి కలిగించింది. నిలువెల్లా వణికిపోయాడు.

రెండు తోడేళ్ళు చెట్లచాటున నిలబడి అతడికేసే చూస్తూ తొక్కలు ఎగరవేస్తున్నవి, నాలుకలు చాస్తున్నవి. అతడిలో యింకా జీవం వున్నదా, లేక మరణించాడా అన్న సంశయంలో అవి కొట్టుమిట్టాడుతున్నట్టు ఉగ్రదత్తుడికి తోచింది. తను నిస్స



హేయ స్థితిలో వున్నట్టు అవి గ్రహిస్తే, తన మీదకు తప్పక లంఘించి తీరుతవి.

ఉగ్రదత్తుడు ఎక్కడలేని సత్తువా తెచ్చుకుని, మోచేతుల బలంతో నేలమీదినుంచి కొంచెం లేచి, పెద్ద గొంతుతో కేక పెట్టాడు. ఆ కేక వింటూనే తోడేళ్ళు చెట్లల్లోకి పారిపోయినై. ప్రస్తుతానికి ఆపద గడిచింది, అనుకుని ఉగ్రదత్తుడు పెద్దగా నిట్టూర్చాడు.

సూర్యుడు క్రమంగా పడమటి దిక్కుకు దిగి కొండశిఖరాల వెనకకు పోయాడు. ఉగ్రదత్తుడున్న ప్రదేశం కొంచెంకొంచెమే చల్లబడసాగింది. అతడి కిప్పుడు దాహంతో పాటు, ఆకలికూడా ప్రారంభమయింది. ఏదో మత్తులాటిది తన శరీరాన్ని కమ్ముకుంటున్నట్టు అతడు భావించాడు. మైకంలో వుండగా తోడేళ్ళు తప్పక నన్ను కబళించగలవు అనుకున్నాడు ఉగ్రదత్తుడు. కాని, మెలకువగా వుండాలన్న అతడి ప్రయత్నం వృధా అయింది. అతడు మగత నిద్రలోకి జారుకున్నాడు.

ముఖాన్నీ, నడుమునూ ఏవో బలమైన గోళ్లు తాకినట్టయి ఉగ్రదత్తుడు ఉలిక్కిపడి లేచాడు. ఆ మరుక్షణం దూరంగా కేకలు వినిపించినై. ఉగ్రదత్తుడు కూడా అప్రయత్నంగా కీచుమని అరిచాడు. మసక వెలు



తురులో అతడికి తన మీదినుంచి కుప్పించి ఎగిరి అల్లంత దూరంలో వున్న చెట్లలోకి పారిపోతున్న నల్లని ఆకారం ఒకటి కనిపించింది. అది ఎలుగుబంటి!

ఉగ్రదత్తుడు నిశ్చేష్టుడయాడు. ఎవరో దూరంనుంచి వేసిన కేకలు విని, భయపడి ఎలుగు తనకు హాని చేయకుండా పారిపోయింది. ఆ కేకలు పెట్టినవాళ్ళు ఎవరై వుంటారు?

"ఇదుగో, రండి, రండి. ఇక్కడ పొదల మధ్య పడివున్నాడు. ఎలుగుబంటి పారిపోయింది," అంటూ ఒకడు ఉగ్రదత్తుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చాడు. అతడి చేతిలో



పెద్ద ఈటె ఒకటి వున్నది. ఎలుగుబంటి చర్మాలు ధరించి వున్నాడు.

ఉగ్రదత్తుడు మూలుగుతూ తల ఎత్తి, "ఈ కట్లు విప్పండి. దాహం తీర్చుకునేందుకు నీరు ఏమైనా వుంటే యివ్వండి," అని అడిగాడు బొంగురుపోయిన గొంతుతో.

భల్లూకరాయుడు మారు మాటాడకుండా ఉగ్రదత్తుడి కట్లు విప్పసాగాడు. ఇంతలో మరిద్దరు భల్లూకరాయుళ్ళు అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడి దగ్గిర భుజానికి వేలాడుతున్న సొరకాయబుర్ర వున్నది. ఉగ్రదత్తుడు దానికేసి వేలు చూపుతూ, దాహం అని సౌంజ్ఞచేశాడు. భల్లూకరాయుడు సొరకాయ బుర్రకు వున్న బెండును వూడదీసి, బుర్రను ఉగ్రదత్తుడి నోటికి అందించాడు. ఉగ్రదత్తుడు ఆత్రంగా గటగట నీరు తాగి, యిక చాలునన్నట్టు తల ఆడించాడు.

దాహం తీర్చుకోవటంతోనే ఉగ్రదత్తుడికి ప్రాణం తిరిగివచ్చినట్టయింది. ఇంతలో అతడి కాళ్ళకూ, చేతులకూ వున్న కట్లు కూడా విప్పబడినై. ఉగ్రదత్తుడు కాళ్ళూ, చేతులను అటూ యిటూ సాగదీసుకున్నాడు. వాటిల్లో రక్తప్రసారం తిరిగి ప్రారంభమై, అవి స్వాధీనానికి వచ్చినై.

"లేచి నడవగలవా?" అని ఒక భల్లూకరాయుడు అతణ్ణి అడిగాడు.

"మీరు శత్రువులా, మిత్రులా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"ఆ సంగతి నువ్వు మా నాయకుడి కిచ్చే జవాబులనుబట్టి ఆయనే నిర్ణయిస్తాడు," అన్నాడు భల్లూకరాయుడు.

"సరే, పదండి!" అంటూ ఉగ్రదత్తుడు లేచి నిబడ్డాడు. భల్లూకరాయుళ్లు ముగ్గురూ అతణ్ణి వెంటబెట్టుకుని, చెట్లల్లో కొంతదూరం నడిచి, ఎగుడు దిగుడుగా వున్న కొండరాళ్ళ మధ్య గల ఒక బల్లపరుపు రాతిని ఎత్తి, బిలం లోపలకు దిగి, తిరిగీ రాతిని ఎప్పటిలా మూసేశారు.

—(ఇంకా వుంది)





# సీతావనవాసం

రావణాసురుణ్ణి చంపి రాముడు సీతతోసహా అయోధ్యకు వచ్చి, రాజ్యాభిషేకం చేసుకుని, ప్రజారంజకంగా పరిపాలన చేస్తున్నాడు. ఇంతలో రాముడి అక్క అయిన శాంతయొక్క భర్త ఋష్యశృంగ మహాముని ఒక యజ్ఞం తలపెట్టాడు. దానికి వసిష్ఠుడూ, ఆయన భార్య అరుంధతీ, కౌసల్యా కైకేయీ సుమిత్రలూ బయలుదేరి వెళ్లారు. నిండు చూలాలు కావటంచేత సీత మాత్రం వెళ్ళలేదు. ఆమె కోసం రాముడు కూడా అయోధ్యలోనే ఉండిపోయాడు.

అర్జునుడనే చిత్రకారుడు రామ చరిత్ర జరిగినంతవరకు—అంటే సీత అగ్ని ప్రవేశించేవరకూ—బొమ్మలుగా చిత్రించాడు. వాటిని చూసి సీత ఆనందిస్తుందనే ఉద్దేశంతో లక్ష్మణుడు పట్టుకువచ్చాడు. సీతారాములు ఆ బొమ్మలను తిరగవేస్తూ మధ్య మధ్య సరదాగా మాట్లాడుకున్నారు.

ఆ బొమ్మలను చూస్తూంటే సీతకు, తిరిగి గంగాస్నానం చెయ్యాలనీ, గంగాతీరపు అరణ్యాలలో విహరించాలనీ కోరిక కలిగి, ఆ మాట రాముడితో చెప్పింది. గర్భిణిగా ఉన్న కారణంచేత ఆమె ఏది కోరినా నెరవేర్చమని పెద్దలు చెప్పి ఉండటంవల్ల రాముడు సరేనని, లక్ష్మణుడితో రథం సిద్ధం చేయించమని చెప్పాడు. లక్ష్మణుడు వెళ్లిపోయాడు. సీత అలిసిపోవటంచేత రాముడి తొడపై తల పెట్టుకుని నిద్రపోయింది.

ఇంతలో దుర్ముఖుడనేవాడు రాముణ్ణి దర్శించటానికి వచ్చాడు. పరిపాలన గురించి ప్రజలు అనుకునే మాటలు ఆలకించి, వాటిని రాముడి చెవిన వెయ్యటం ఈ దుర్ముఖుడి పని. అందుచేత రాముడు వాణ్ణి తానున్న చోటికి రప్పించుకుని విశేషాలు అడిగాడు.

దుర్ముఖుడు మొదట రాముణ్ణి గురించి ప్రజలు మంచిగా అనుకునే మాటలే

భవభూతి నాటక కథ

చెప్పాడు. కాని రాముడు చెడ్డగా అనుకునే మాటలేవైనా ఉంటే చెప్పమన్నాడు. అప్పుడు వాడు, "ప్రభూ, పరాయివాడి పంచన ఉండి వచ్చిన సీతను తమరు మహాపతివ్రతగా పరిగణించి స్వీకరించటం అవివేకమని కొందరు అనుకుంటున్నారు," అని చెప్పాడు.

రాముడి గుండె గుభేలుమన్నది. సీతకు అగ్నిపరీక్ష పెట్టినాకనే తాను స్వీకరించాడు! అయినప్పటికీ ఇక్ష్వాకురాజులు ప్రజాభిప్రాయాన్ని ఎల్లప్పుడూ పాటించారు. వారి అడుగు జాడలలో నడిచే తాను సీతను వదలిపెట్టక తప్పదు.

రాముడు దుర్ముఖుడితో, "నీవు లక్ష్మణుడి వద్దకువెళ్ళి, సీతను అరణ్యాలలో వదలిపెట్టి రమ్మన్నానని రాజునైన నా ఆజ్ఞగా చెప్పు!" అన్నాడు. అతను సీత తలను తన తొడపైనుంచి మెల్లిగా కిందికి దింపి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

సీత నిద్ర లేచేసరికి ఆమెకోసం రథం సిద్ధంగా ఉన్నట్టు తెలిసింది. ఆమె సంతోషంగా వెళ్ళి రథంలో ఎక్కి గంగాతీరానికి బయలుదేరింది...

కాని లక్ష్మణుడు ఆమెను గంగాతీరాన, వాల్మీకి ఆశ్రమ సమీపంలో గల అరణ్యంలో విడిచి, రాముడి నిర్ణయం తెలిపి వెళ్ళిపోయి



నాక సీత భరించరాని మానసిక వేదన అనుభవించి, గంగలో దూకింది. అక్కడే ఆమె ఇద్దరు కొడుకులను, కవల పిల్లలను, కన్నది. అప్పుడు గంగాదేవీ, భూదేవీ వచ్చి సీతను పాతాళ లోకానికి తీసుకుపోయి అక్కడ ఆమెను సురక్షితంగా ఉంచారు. పసిపిల్లలకు తల్లిపాలు మానే ఈడు వచ్చాక గంగాదేవి ఆ పిల్లల నిద్దరినీ తీసుకుపోయి వాల్మీకి మహామునికి అప్పగించింది. వారిద్దరూ కుశలవు లనే పేరుతో వాల్మీకి మహాముని ఆశ్రమంలో పెరుగుతూ సకల విద్యలూ అభ్యసించారు.

పన్నెండేళ్ళు గడిచాయి.

ఈలోపుగా రాముడు తనకు భార్యగా ఒక బంగారు సీతను చేయించుకుని అశ్వమేధ యాగం తలపెట్టాడు. ఇందుకుగాను ఒక గుఱ్ఱాన్ని దేశాలపైకి పంపుతారు. దాని వెనకగా కొందరు యోధులుండి, ఆ గుఱ్ఱాన్ని పట్టుకున్నవారిని ఓడిస్తారు. రాముడు పంపిన గుఱ్ఱాన్ని రక్షించటానికి లక్ష్మణుడి కొడుకైన చంద్రకేతువు సైన్యంతో సహా బయలుదేరాడు.

ఈ సమయానికే ఋష్యశృంగుడు చేస్తూ ఉండిన పన్నెండేళ్ల యజ్ఞం పూర్తి అయింది. వసిష్ఠుడూ, అరుంధతీ, కౌసల్యా మొదలైన వారు సీతావనవాసం గురించి తెలుసుకుని,





సీత లేని అయోధ్యకు వెళ్లటం ఇష్టం లేక, వాల్మీకి మహాముని ఆశ్రమంలో ఉండి పోవటానికి నిశ్చయించుకుని అక్కడికి చేరుకున్నారు. సీత తండ్రి జనకుడుకూడా అక్కడికి వచ్చాడు.

ఈ సమయంలోనే ఒకనాటి మధ్యాహ్నం వాల్మీకి తమసా నదిలో స్నానం చేయబోయి, అక్కడ ఒక కిరాతుడు క్రౌంచ పక్షుల జంటలో ఒకదానిని కొట్టటం చూశాడు; వెంటనే అప్రయత్నంగా ఆయన నోట కవిత్వం వచ్చేసింది. అప్పుడా మునికి బ్రహ్మ ప్రత్యక్షమై శ్రీరాముడి కథను గ్రంథంగా రచించమని సలహా ఇచ్చాడు.

అది మొదలు వాల్మీకి రామాయణ రచనలో నిమగ్నుడై పోయాడు.

ఇంతలో ఒకనాడు ఒక బ్రాహ్మడు చచ్చిపోయిన తన కొడుకును భుజాన మోస్తూ, అయోధ్యలో రాజద్వారం వద్దకు వచ్చి, "రాజ్యంలో ఏదో అన్యాయం జరిగింది! లేకపోతే నాకొడుకు అకాలమరణం ఎందుకు పొందాడు?" అని గుండె బాదుకోసాగాడు. రాముడిది విని చాలా కలతపడ్డాడు. శంబూకుడనే శూద్రుడు ఎక్కడో తపస్సు చేస్తున్నాడనీ, అందుచేతనే ఈ ఘోరం జరిగిందనీ రాముడికి తెలిసింది. ఆ శంబూకుణ్ణి వెతుక్కుంటూ రాముడు విమానంలో బయలుదేరాడు.

శంబూకుడు తపస్సు చేస్తున్నది జనస్థానంలో. రాముడు ఎలాగూ శంబూకుణ్ణి చంపటానికి జనస్థానానికి వచ్చి సమీపంలో ఉన్న అగస్త్యుడి ఆశ్రమం చేరుకుంటాడు గనక అతన్ని సీత చూడటానికి ఇది మంచి అవకాశమని గ్రహించి, గంగాదేవి సీతను అదృశ్యురాలిగా చేసి తమసను తోడిచ్చింది.

ఒకనాటి ఉదయం సీత స్నానంచేసి సూర్యుడి పూజకు పూలు కోస్తూండగా, సీత పెంచిన గున్న ఏనుగుపైకి ఒక మదపుటేనుగు వచ్చింది. "అయ్యో, ఆర్యపుత్రా!

నా కుమారుణ్ణి రక్షించండి!" అని సీత అప్రయత్నంగా కేకపెట్టింది. వెంటనే ఆమెకు పంచవటినాటి విషయాలు జ్ఞాపకం వచ్చి మూర్ఛపోయింది. తమస ఆమెకు శైత్యోపచారాలు చేసింది.

ఆ సమయానికి రాముడు అటుగా వచ్చాడు. తానూ, సీతా కలిసి తిరిగిన చోటు చూసి, సీత జ్ఞాపకంరాగా మూర్ఛపోయాడు. అప్పుడు తమస ప్రేరేపణతో సీత రాముణ్ణి తాకి అతనికి తెలివి తెప్పించింది. సీతే తనను తాకిందని రాము డనుకున్నాడుగాని అదృశ్యంగా ఉన్న సీత అతనికి కనిపించ లేదు. ఇంతలో వాసంతి అనే వనదేవత రాముడి వద్దకు వచ్చింది. రాముడు కాపాడ నవసరం లేకుండానే సీత పెంచిన ఏనుగు గున్న మదపుటేనుగును ఓడించి తరిమి కొట్టింది. తరవాత వాసంతి రాముణ్ణి, సీతను అడవులపాలు చేసినందుకు దెప్పిపొడిచింది. ప్రజలచేత మాట పడకుండా ఉండటానికి తాను సీతను పోగొట్టుకున్నాననీ, సీతను అరణ్య మృగాలు ఏనాడో చంపి ఉంటా యనీ రాముడు విలపించాడు. సీత అతని బాధ చూడలేక బాధపడింది.

రాముడి దుఃఖం పోగొట్టటానికిగాను వాసంతి అక్కడి ప్రదేశమంతా చూపి పాత



సంగతులు మరింతగా జ్ఞాపకం చేసేసరికి రాముడు తిరిగి మూర్ఛపోయాడు. సీత మళ్లీ అతన్ని స్పృశించి స్పృహ తెప్పించింది. అయితే ఆమె తన చేతిని వెంటనే తీసేసుకోక పోపటంచేత రాముడామె చెయ్యి పట్టుకుని, "సీత నాకు చిక్కింది," అన్నాడు. వాసంతి చుట్టూ కలయజూసి, "ఇక్కడ ఎవరూ లేరే!" అన్నది. అంతలోనే సీత తన చెయ్యి లాగేసుకున్నది. తాను కలగని ఉండాలను కున్నాడు రాముడు.

అక్కడ వాల్మీకి మహాముని ఆశ్రమం వద్దకు రాముడు పంపిన యాగాశ్వం వచ్చింది. ఆశ్రమంలో ఉండే పిల్లలు దాని

చుట్టూ మూగారు; వారు గుర్రం గురించి విన్నారు గాని ఇంతవరకు దాన్ని చూడలేదు. "ఇది లోకైక వీరుడైన రాముడి గుర్రం; శూరులైనవారుంటే దీనిని పట్టుకోండి," అని గుర్రం ముఖాన ఒక బిళ్లపై రాసిఉన్న మాటలు చదివి మహాశూరుడైన లవుడు ఆ గుర్రాన్ని పట్టుకున్నాడు.

ఇంతలో సైనికులు వచ్చి, "అబ్బాయీ, చంద్రకేతువు వచ్చాడంటే నిన్ను చంపేస్తాడు, ఇది రాముడి గుర్రం. రాముడు రావణాసురుణ్ణి చంపిన లోకైకవీరుడు," అని లవుణ్ణి భయపెట్టారు. అందుకు సమాధానంగా లవుడు, "లోకంలో రాముడుతప్ప ఇక వీరులే లేరా?" అంటూ విల్లు ఎక్కుపెట్టి సైనికులను చెల్లాచెదరుగా కొట్టేశాడు. చంద్రకేతువు వచ్చి పారిపోయే సైనికులను ఆపి, తనతో యుద్ధం చెయ్యమని లవుణ్ణి కోరాడు. ఈలోపల సైనికులు తనను చుట్టుముట్ట యత్నించేసరికి లవుడు జృంభకాస్త్రం ప్రయోగించి సైనికులందరినీ స్తంభింపజేశాడు. రాముడికి మాత్రమే తెలిసిన ఈ అస్త్రం ఈ ఆశ్రమ బాలుడికి ఎలా తెలిసిందా అని చంద్రకేతువు ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

తరవాత లవుడూ చంద్రకేతువూ యుద్ధం సాగించి ఒకరి అస్త్రాలను ఒకరు ధ్వంసం



చెయ్యసాగారు. ఇంతలో రాముడు విమానంలో వారి మధ్య దిగాడు. అప్పటివరకూ లవుడికి రాముడంటే గౌరవభావం లేదు, కాని రాముణ్ణి స్వయంగా చూడగానే ఆ కుర్రవాడికి ఎక్కడ లేని గౌరవమూ కలిగింది. రాముడి కోరికపై లవుడు జృంభకాస్త్రాన్ని ఉపసంహరించి, ఆ అస్త్రం తనకూ తన అన్న అయిన కుశుడికీ పుట్టుకతోనే వచ్చిందని రాముడితో చెప్పాడు. ఇంతలో కుశుడు కూడా అక్కడికి వచ్చాడు. అతడు వాల్మీకి రామాయణాన్ని భరతముని వద్దకు తీసుకుపోతున్న వారివెంట రక్షగా వెళ్ళి ఉన్నాడు. భరతముని ఆ రామాయణాన్ని అప్సరసలచేత ఆడించటానికి సంకల్పించాడట.

తరవాత కుశ లవులు రాముడి కోరికపై వాల్మీకిరామాయణం నుంచి ఒక భాగం చదివారు.

రాముడు గడచిన విషయాలు తలుచుకుని చాలా బాధపడ్డాడు.

రాముడికోసం వాల్మీకి గంగాతీరాన ఒక నాటకశాల నిర్మించి ఉత్తరరామాయణ నాటకం ఏర్పాటుచేశాడు. ఆ నాటకంద్వారా రాముడికి సీత కవలపిల్లలను కనటమూ, భూదేవీ గంగాదేవీ ఆమెను పాతాళలోకం చేర్చటమూ, జృంభకాస్త్రం సీత కొడుకులను



ఆశ్రయించటమూ, తరవాత కుశలవులను వాల్మీకి పెంచటమూ మొదలైన విషయాలు తెలిసివచ్చాయి. నాటకం చూస్తూ రాముడు మూర్ఛపోయాడు.

ఇంతలో గంగానదిలో నుంచి గంగాదేవి భూదేవీ సీతను తీసుకుని పైకి వచ్చి ఆమెను అరుంధతికి అప్పగించారు. రాముడింకా మూర్ఛలోనే ఉన్నాడు. అరుంధతి అనుమతితో సీత రాముణ్ణి తాకింది. రాముడు తెలివి తెచ్చుకుని సీతనూ, అరుంధతినీ చూసి సిగ్గుపడ్డాడు.

ఈ నాటకం జరిగిన చోట జనకుడూ, వసిష్ఠుడూ, కౌసల్య మొదలైనవారూ, లక్ష్మణుడూ, నాలుగు వర్ణాల పౌరులూ కూడా ఉన్నారు. అరుంధతి వారందరినీ సంబోధిస్తూ, "మహాజనులారా, సీత మహా పతివ్రత అని అదివరకే అగ్నిదేవుడు చెప్పాడు. ఇప్పుడు భూదేవీ గంగాదేవీకూడా అదేమాట చెబుతున్నారు. స్వీకరించటానికి సీత అర్హురాలేనా? మీరంతా ఏమంటారు?" అని అడిగింది.

"స్వీకరించ వచ్చు!" అని అందరూ ఎలుగెత్తి చెప్పారు.

"ఇంకేం, నాయనా? నీ భార్యను నీవు స్వీకరించు," అన్నది అరుంధతి రాముడితో.

లక్ష్మణుడు సీతకు నమస్కారం చేశాడు. సీత అతన్ని దీవించింది.

వాల్మీకి కుశ లవులను అక్కడికి తెచ్చి, వారికి సీతా రామ లక్ష్మణ జనకులను పరిచయం చేస్తూ, "మీ అమ్మ, మీ నాన్న, మీ చిన్నాన్న, మీ తాతగారు," అని వివరించి చెప్పాడు. ఆ సమయానికే లవణాసురుణ్ణి చంపిన శత్రుఘ్నుడు కూడా అక్కడికి వచ్చాడు. ఇది మరొక సంతోషకారణమయింది.

ఆ తరవాత రాముడు తన భార్యా బిడ్డలతో అయోధ్యకు తిరిగి వచ్చి సుఖంగా రాజ్యపాలన చేశాడు.





# పారని యుక్తి

ఒక ఊళ్ళో ఒక ధనికుడుండేవాడు. ధనవంతుడైనందుకు ఆయన దానధర్మాలు విరివిగా చేసి, గొప్ప దాత అన్న కీర్తి సంపాదించుకున్నాడు.

పొరుగూళ్ళో ఇంకొక ధనికుడుండేవాడు. అయితే ఆయన పరమ లోభి, కాకికి కూడా ఎంగిలిచెయ్యి విదిలించేవాడు కాడు. అందుచేత దాతను మెచ్చుకున్న నోటితోనే జనం లోభిని పడతిట్టేవారు.

తనకు వచ్చిన ఈ అపఖ్యాతిని ఎలాగైనా పోగొట్టుకోవాలని లోభికి తోచింది. ఆయన వద్ద విశ్వాసపాత్రుడైన ఒక నౌకరు ఉన్నాడు; ఆయన వాడితో సంప్రతించి, ఏదైనా ఉపాయం ఆలోచించమన్నాడు.

"మీరు గొప్ప దాత అని లోకంచేత అనిపించటం సాధ్యంకాదు. కాని దాతగా పేరు తెచ్చుకున్న పొరుగూరి పెద్దమనిషిని సులువుగా మోసగించవచ్చు. ఆయనను ఒక నాడు మన ఇంటికి అతిథిగా పిలవండి. ఆయన మన ఇంట్లో ఉన్న సమయంలో నేను రకరకాల వేషాలు వేసుకుని అడుక్కోవటానికి వస్తాను. ఆయన చూస్తూ ఉండగా నాకు ప్రతిసారీ నూరేసి వరహాలు దానం ఇవ్వండి. ఆ దెబ్బతో ఆయన నిర్ఘాంతపోయి కనిపించినవారి కందరికీ మీ దాతృత్వం గురించి చెబుతాడు. కానిఖర్చు కాకుండా మీకు కూడా బోలెడంత కీర్తి వచ్చేస్తుంది," అని నౌకరు లోభికి సలహా చెప్పాడు.

"నీ ఆలోచన భేషుగ్గా ఉంది. రేపే ఆయనను భోజనానికి రమ్మందాం. ఈ సాయంకాలం నువ్వు వారి గ్రామం వెళ్ళి, ఎలా చెప్పాలో అలా చెప్పి, రేపు ఉదయమే మన ఇంటికి రమ్మను," అన్నాడు లోభి.

నౌకరు దాత ఉండే గ్రామానికి వెళ్ళి ఆయనతో, "అయ్యా, మా యజమానిగారు రేపు ఉదయానికల్లా తమరిని అతిథిగా

ఎం. రంగారావు




వచ్చెయ్యమన్నారు," అని విన్నవించుకున్నాడు.

"మీ యజమాని పిల్లికి బిచ్చం పెట్టడని ప్రతీతిగదా, నన్ను రేపు అతిథిగా పిలవటంలో ఆయన ఉద్దేశం ఏమిటి? ఏమిటి విశేషం?" అని దాత లోభియొక్క నౌకరును అడిగాడు.

"అయ్యా, మా యజమానిని గురించి అందరూ అనుకునే మాటలను మీరు నమ్మినట్టున్నారు. అసలు సంగతి చెబుతాను వినండి. ఆయన చాలా గొప్ప దాత. మామూలు బిచ్చగాళ్ళకు కూడా ఆయన నూరు వరహాలకు తక్కువ ఇవ్వడు. అయితే ఆయన చేసేవి గుప్తదానాలు; మూడోకంటి వాడికి తెలియవు. ఎందుకూ? రేపు మీరే చూస్తారుగా! ఇక మిమ్మల్ని భోజనానికి ఆహ్వానించటంలో విశేషమేమంటే ఇప్పటి వరకూ ఆయన చేసిన దానాలతో లక్ష పూర్తి అయింది. అందుకని ఆయన రేపు గుడిలో అభిషేకం చేయిస్తున్నారు. ఆ సందర్భంలో ఒక తగిన మనిషికి భోజనం పెట్టాలని కూడా ఆయన నిశ్చయించారు. ఈ ప్రాంతాల ఆయనతో సరితూగ గల దాత మీరే గనక మిమ్మల్ని తప్పక రమ్మని చెప్పమన్నారు," అన్నాడు లోభి పంపిన నౌకరు.

దాత కొంచెంసేపు ఆలోచించి, "సరే, రేపు పెందలాడే వస్తున్నానని మీ యజమానితో చెప్పు," అన్నాడు.

నౌకరు లోభి వద్దకు తిరిగి వచ్చి, తాను చెప్పిన మాటలన్నీ ఆయనతో చెప్పాడు. మర్నాడు దాత లోభి యింటికి వచ్చాడు.

"తమరు వెంట నౌకరయినా లేకుండా వచ్చారేమిటి?" అన్నాడు లోభి.

"చిన్న పని ఉండి మా నౌకరు దిగబడిపోయాడు. ఆ పని పూర్తికాగానే వాడూ వస్తాడులెండి," అన్నాడు దాత.

"చూశారా? నేను ఇప్పటికి లక్ష వరహాలు దానంచేసి ఉన్నానన్న సంగతి మా

నౌకరు మీకు చెప్పేశాడట. నా దానాలు గురించి ఇతరులకు తెలియటం నాకు సుతరామూ ఇష్టంలేదు సుమండీ. దాన ధర్మాలు చెయ్యటం ప్రధానంగాని, నాకు కీర్తి ప్రధానం కాదు. అందుచేత నా రహస్యం మీరు మరెక్కడా బయట పెట్టకండి!" అన్నాడు లోభి.

లోభి వద్ద ఉండే నౌకరు తన యజమానితో, "బాబూ, నేను గుడికి వెళ్లి అభిషేకాలు చేయించి వస్తాను," అని బయలుదేరి ఇంటికి వెళ్ళిపోయాడు. తరవాత వాడు ఒక ముసలి బిచ్చగాడి వేషం వేసుకుని తన యజమాని ఇంటికే వచ్చాడు. దాతతో మాట్లాడుతూ ఉండిన లోభి తన పక్కన పెట్టుకుని ఉన్న సంచీలో నుంచి నూరు వరహాలు తీసి దానం చేశాడు.

ముసలి బిచ్చగాడు వెళ్ళిపోయిన కాస్సేపటికే ఒక బైరాగి వచ్చాడు. వాడికి కూడా లోభి నూరు వరహాలిచ్చి పంపాడు.

అదిమొదలు భోజనాలవేళ అయేలోపల ఒక మూగవాడూ, ఒక గుడ్డివాడూ, ఒక దాసరీ, ఒక యాత్రికుడూ, ఒక బుడబుక్కలవాడూ, ఈవిధంగా పదిమంది వచ్చారు. లోభి అందరికీ నూరేసి వరహాలు ఇవ్వటమేగాక, తన నౌకరు చాక చక్యంతో ఇన్ని వేషాలు మార్చిరావటం మెచ్చు



కున్నాడు. దాత లోభితో, "మీవంటి దాతను నేను ఎక్కడా చూడలేదు, వినలేదు. ఈరోజే మీరు పదివేల వరహాలు ధర్మం చేసి నట్టుంది!" అన్నాడు.

"లేదండీ, పదిమంది వచ్చారు, పది నూర్లు దానంచేశాను. ఇది నాకు పరిపాటే లెండి," అన్నాడు లోభి.

మధ్యాహ్నానికల్లా లోభి నౌకరు తన మామూలు వేషంలో వచ్చాడు. వాడు తన యజమానితో, "అయ్యా, లక్ష పత్రి పూజా, అభిషేకం ఇప్పుడే పూర్తి అయాయి. ఇదుగో ప్రసాదం తెచ్చాను," అని చెప్పి పళ్ళెంతో సహా ఇంట్లోకి వెళ్ళాడు.

కాస్సేపటికి లోభికూడా లోపలికి వెళ్ళి నౌకరుతో, "నాటకం మాబాగా ఆడావు! ఏదీ మనసొమ్ము?" అన్నాడు.

"ఇదుగో చూసుకోండి! అయిదు వందలు!" అంటూ నౌకరు లోభికి డబ్బు మూట ఇచ్చాడు.

"అయిదు వందలేమిటి? నేను నీకు వెయ్యి వరహాలిస్తినిగా?" అన్నాడు లోభి.

"లేదండీ, నేను అయిదుసార్లే వచ్చాను. మీరు నూరేసి ఇచ్చారు," అన్నాడు నౌకరు.

"మరి పదిమంది వచ్చారే! నువు అయిదుసార్లే వస్తే మిగిలిన అయిదుసార్లూ వచ్చినవాళ్ళెవరూ?" అని లోభి ఆందోళన కొద్దీ గట్టిగా అడిగాడు.

"వాడు మా నౌకరు అయి ఉంటాడు లెండి," అని దాత గొంతు వినిపించింది. యజమానీ నౌకరూ లోపల మాట్లాడుకునే సమయంలో ఆయన చల్లగా లోపలికి వచ్చి సంభాషణ అంతా విన్నాడు.

"మా నౌకరు కూడా ఇక వచ్చేస్తాడు. వాడుకూడా మంచి నమ్మకస్తుడే లెండి. మీరిచ్చిన అయిదువందలూ ఎక్కడికీ పోవు!" అన్నాడు దాత.

లోభి ఆశ్చర్యావమానాలతో కుంగిపోయి ఏమీ అనలేక కొయ్యబారిపోయాడు.





# తోడేలు ఉపవాసం

ఒక అడవిలో ఒక తోడేలు ఒంటరిగా జీవిస్తూ ఉండేది. తోడేళ్ళు మందలుగా వేటాడితే నిత్యమూ ఆహారం దొరుకుతుంది గాని ఒంటరి తోడేలు వేటాడి సులువుగా తన పొట్ట నింపుకోలేదు. అందుచేత మన తోడేలు తరుచు ఉపవాసాలుంటూండేది.

ఇలా తిండి దొరకక ఆకలితో బాధపడు తూండగా ఒకనాడు తోడేలుకు ఒక కల వచ్చింది. ఆ కలలో అది ఎన్నోరకాల జంతువులను తిని విందు భోజనం చేసింది.

నిద్ర మెలుకువ రాగానే అది, "భలే మంచి కల వచ్చింది! ఇవాళ నాకు మంచి భోజనం దొరుకుతుంది!" అని సంతోషిస్తూ వేటకు బయలుదేరింది.

కొద్ది దూరం వెళ్ళిందోలేదో, తోడేలుకు అంతదూరాన ఒక మేకా, రెండు పిల్లలూ కనిపించాయి. తోడేలు దూకుతూ వెళ్ళి మేకను సమీపించి, "ఇక నీకూ, నీ పిల్లలకూ నూకలు చెల్లిపోయాయిలే! నాకు చచ్చే ఆకలవుతున్నది. ముందు నీ పిల్లలను భక్షించి, తరవాత తీరిగ్గా నిన్ను తింటాను!" అన్నది.

మేక అటూ ఇటూ చూసి, "నువ్వు మమ్మల్ని తినదలిస్తే నేను ఆపగలను గనకనా! చచ్చేముందు నేనూ నా బిడ్డలూ దైవప్రార్థన చేసుకుంటాము. అందుకు మాత్రం ఒప్పుకో!" అన్నది.

"దానికేంభాగ్యం? దేవుడిలో నమ్మకం ఉంటే అలాగే ప్రార్థనలు చెయ్యండి. ఆ పని అయాకనే మిమ్మల్ని తింటాను," అన్నది తోడేలు.

అప్పుడు మేకా, మేకపిల్లలూ గట్టిగా, "మేఁ, మేఁ!" అని అరిచాయి. ఈ అరుపు దూరాన ఉన్న గొల్లవాడి వేటకుక్కకు వినిపించింది. ఆ వేటకుక్క భయంకరంగా గర్జిస్తూ, భూతంలాగా దూకుతూ మేకలున్న

ఆర్. పద్మనాభం




చోటికి వచ్చింది. ఆ వేటకుక్క అంత దూరాన యమకింకరుడులాగా కనిపించే సరికి పై ప్రాణాలు పైనే పోయినట్టయి తోడేలు అడవిలోకి దౌడుతీసింది.

కొంతదూరం పోయాక, "ఎంత మంచి భోజనం నోటిదాకా వచ్చి పోయిందీ! నాదే బుద్ధితక్కువ," అనుకున్నది తోడేలు.

అది మరికొంతదూరం వెళ్లేసరికల్లా దానికి ఒక బలిసిన కోడిపుంజు కనిపించింది. "నేను నిన్ను తినక తప్పదు. భోజనంచేసి చాలారోజులయింది. ఆకలి మండిపో తోంది!" అన్నది తోడేలు కోడిపుంజు దగ్గిరకు దూకుతూపోయి.

"పాపం, అలాగా? అయితే నన్ను తిని నీ ఆకలిబాధ తీర్చుకో! కాని నన్ను ఒక్కసారి కూయనీ!" అన్నది కోడిపుంజు.

"అదంతా కుదరదు. ఏదో వంకపెట్టి తప్పించుకుపోదామని చూస్తున్నావు గామాలు," అన్నది తోడేలు.

"పిచ్చిదానా, నేనెక్కడికి పారిపోతాను? నీకంత నమ్మకం లేకపోతే నా తోకను నీ నోటితో గట్టిగా పట్టుకో," అన్నది కోడిపుంజు.

"అలా అన్నావు, బాగుంది," అంటూ తోడేలు కోడిపుంజు తోక ఈకలను తన నోటితో గట్టిగా పట్టుకున్నది. కోడిపుంజు గట్టిగా గొంతెత్తి, "కొక్కొరోకో!" అని అరిచింది. అది అలా అరిచేటప్పుడు దాని తోక తాలూకు ఈక ఒకటి తోడేలు గొంతు కెలికింది. తోడేలుకు ఆపుకోలేనంత దగ్గు వచ్చింది. దాని దగ్గుతెర ఉపశమించేలోపల కోడిపుంజు సమీపంలోనే ఉన్న చెట్టుకొమ్మ పైకెక్కి కూచున్నది.

"నా తెలివి తెల్లవారినట్టేఉంది! అందరూ నన్ను మోసగించేవాళ్ళే! ఇవాళ కూడా నాకు తిండి ప్రాప్తిలేదో ఏమిటో?" అనుకుంటూ తోడేలు ముందుకు సాగిపోయింది. అది కొద్దిదూరం వెళ్ళేసరికల్లా ఒక

ఆడ గుర్రమూ, దాని పిల్లా ఎక్కడికో వెళుతూ కనిపించాయి.

"ఆహాఁ, దొరికారుగద! నిన్నూ నీ పిల్లనూ తినేసి భరించరాని నా ఆకలి తీర్చుకుంటాను," అన్నది తోడేలు గుర్రంతో.

"నన్నూ, నా పిల్లనూ తింటావా? మమ్మల్ని తినటానికి నీకు అనుతి ఎవరిచ్చారు? మా జోలికి వచ్చినవాళ్ళను చీల్చి చెండాడేటట్టు శాసన పత్రం ఉన్నది తెలుసా?" అన్నది గుర్రం.

అ మాటలకు తోడేలు నిర్ఘాంతపోయి, "శాసనపత్రమా? ఎవరిది? ఏదీ? నన్ను చూడనీ!" అన్నది.

"నా కాలి అడుగున ఉంది చూసుకో!" అంటూ గుర్రం ముందుకాళ్ళలో ఒకటి ఎత్తింది. తోడేలు ఆ కాలి కిందికి వెళ్ళి పైకి చూడటానికి ప్రయత్నించేటప్పుడు గుర్రం తోడేలును మొహం పగిలేటట్టు తన్నింది.

అ దెబ్బకు తోడేలు స్పృహతప్పి పడిపోయింది. దానికి మళ్ళీ ఒళ్ళు తెలిసేసరికి గుర్రం జాడగాని, దాని పిల్లజాడగాని లేదు.

"నాకన్న బుద్ధితక్కువప్రాణి ఉండటం నిజంగా అసంభవం! ఇన్నిసార్లు మోసపోయినా నాకు కొంచెంకూడా బుద్ధిరాదేం?" అనుకుంటూ తోడేలు ముందుకు పోయింది. కొద్దిసేపట్లో ఒక గొర్రెపోతు ఎదురయింది.



"చూడు, గొర్రెపోతా, నిన్ను ఎలా తింటానో తెలుసా? చర్మంతో, బొచ్చుతో, కొమ్ములతో సహా తినేస్తాను! నాకు అంత ఆకలిగా ఉంది. భోజనంచేసి ఎన్నాళ్ళయిందనుకున్నావ్!" అన్నది తోడేలు.

"తిను, తిను! నన్ను నువు తింటే ఒకటీ, మరొకరుతింటే మరొకటీనా? నేను పుట్టిందే ఒకరికి ఆహారం కావటానికి. నీకు మరీ ఆకలిగా ఉందంటున్నావుగనకా, బొచ్చుతో సహా తింటానంటున్నావుగనకా, నీకు శ్రమ తప్పిస్తాను. నువ్వలా నోరు తెరుచుకు నిలబడు, నేను పరిగెత్తుకుంటూ వచ్చి నీ నోట్లో పడతాను!" అన్నది గొర్రెపోతు.

తోడేలు ఎంతో సంతోషించి నోరు తెరుచుకుని నిలబడింది. గొర్రెపోతు తల వంచి, కొమ్ములు ముందుకు పెట్టి, అంతదూరం నుంచి వాయువేగంతో వచ్చి, తోడేలును డొక్కలో కుమ్మి, అదే వేగంతో ఎటో మాయమయింది.

గొర్రెపోతు తాపుకు తోడేలు అంతదూరాన పడి, శరీరమంతా హూనమై, లేచి ఒళ్ళు దులుపుకుంటూ, "నిశ్చయంగా, నా నోట్లో ఇవాళ శని ఉన్నది. ఆ దిక్కుమాలిన కలను నమ్మి తిండి దొరుకుతుందనుకున్నాను. తిండి దొరికినా దాన్ని దక్కించుకునేటందుకు నాకు బుద్ధి ఉంటేకద! నా వంటి బుద్ధితక్కువ దద్దమ్మను ఎవడైనా తోక నరికినా పాపం ఉండదు!" అనుకున్నది. ఈమాట అనుకునేటప్పుడు అది ఒక పెద్ద చెట్టుపక్కన ఉన్నది. ఆ చెట్టు వెనక ఒక వేటగాడు నక్కి ఉన్నాడు. వాడికి తోడేలు తోక అందుబాటులో ఉన్నది. వాడు తన గొడ్డలి ఎత్తి తోడేలు తోక మొదట్లో ఒక్కపెట్టు పెట్టాడు. ఆ దెబ్బతో తోడేలు తోక కాస్తా తెగిపోయింది.

"పోనీ, ఇలాగైనా నేను కోరిన కోరిక ఒకటి నెరవేరింది!" అనుకుంటూ తోడేలు అక్కడి నుంచి పారిపోయింది.






# ముగ్గురు ప్రవీణులు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నేనైనా అలిసిపోయానుగాని నీకు అలసట అన్నది కనిపించదే! అయినా నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

అంగదేశంలో వృక్షపుటమనే అగ్రహారం ఉండేది. అందులో విష్ణుస్వామి అనే బ్రాహ్మణుడుండేవాడు. ఆయన ధనికుడు, అనేక యజ్ఞాలు చేసినవాడు. ఆయనకు విచిత్రమైన శక్తులు గల ముగ్గురు కుమారులు ఉన్నారు.

పెద్దవాడు తన భోజనంలో ఎంత సూక్ష్మమైన దోషం ఉన్నా కనిపెట్టగలవాడు. రెండవవాడు ఎలాటి స్త్రీలోగాని ఏపాటి

## బేతాళ కథలు

దోషం ఉన్నా తెలుసుకోగలవాడు. మూడో వాడు తాను పడుకున్న పక్కలో ఏపాటి దోషం ఉన్నా నిద్రపోలేకపోయేవాడు.

ఒకసారి విష్ణుస్వామి ఒక యాగం తల పెట్టాడు. అందుకుగాను ఒక సముద్రపు తాబేలు కావలిసి వచ్చింది. దానిని పట్టుకు రమ్మని ఆయన తన కొడుకులను ఆజ్ఞా పించాడు. ఆప్రకారమే వాళ్ళు సముద్రానికి వెళ్ళి ఒక తాబేలును సంపాదించారు. ఇక దానిని ఇంటికి తీసుకుపోవాలి. అప్పుడు పెద్దవాడు తన తమ్ములతో, "మీలో ఎవ రైనా దీనిని ఇంటికి తీసుకుపోండి. నేను మాత్రం ఈ తాబేలును తాకను," అన్నాడు.

"ఈ తాబేలును ఇంటికి చేర్చే భారం నాన్నగారు మన ముగ్గురి పైనా ఉంచి నప్పుడు, నీవు మాత్రం ఎలా తప్పించుకో గలవు. అయినా దీన్ని కొంతదూరం మాలాగే మొయ్యటానికి నీకేమిటి అభ్యంతరం?" అని తమ్ములు అన్నను అడిగారు.

"నా శక్తి మీకు తెలుసుగదా? నీచు కంపు కొడుతూ, జారుడుగా ఉన్న ఈ తాబే లును తాకానంటే నేను తిరిగి జన్మలో భోజనం చెయ్యలేను," అన్నాడు పెద్దవాడు.

ఈ మాట విని రెండోవాడు, "అబ్బో నీకున్నపాటి శక్తి నాకూ ఉన్నది. ఏ స్త్రీలో నైనా అవగింజలో వెయ్యోవంతు దోషం



ఉంటే నేను తెలుసుకోగలను. నేను మాత్రం ఈ తాబేలును ఎందుకు మొయ్యాలి?" అన్నాడు.

అన్నదమ్ములు ముగ్గురూ తాబేలు గొడవ వదిలేసి, నా శక్తి గొప్పదంటే నా శక్తి గొప్పదని చాలాసేపు వాదించుకుని, చివరకు తాబేలును అక్కడే వదిలేసి, తమ శక్తులను గురించి తేల్చుకోవటానికి ఆ సమీపంలోనే ఉన్న విటంకపురపు రాజు ప్రసేనజిత్తు అనే ఆయన వద్దకు వెళ్ళారు. రాజు వారిని లోపలికి రప్పించి వచ్చిన పని అడిగాడు.

"ఎంత నిర్దుష్టమైన భోజనంలోగాని ఏదైనా దోషం ఉంటే నేను తెలుసుకోగలను," అన్నాడు పెద్దవాడు.

"ఎంత నాజూకుగా పెరిగిన అడదానిలోనైనాసరే కించిత్తు దోషం ఉంటే నేను కనిపెట్టగలను," అన్నాడు రెండోవాడు.

"ఎంత దివ్యమైన హంసతూలికా తల్పంలోనైనా సరే నలుసంత దోషం ఉంటే అది నాకు తెలుస్తుంది," అన్నాడు మూడోవాడు.

"మా అందరి శక్తులలోనూ ఎవరిది గొప్పదో తమరు నిర్ణయించాలి. ఇందుకే మేము మీ దర్శనం చేయవచ్చాం," అన్నారు ముగ్గురు అన్నదమ్ములూ.



వారి మాటలు రాజుకు ఆశ్చర్యం కలిగించాయి. ఏ నిర్ణయంగాని చేసేముందు వారి శక్తులను పరీక్షించాలని ఆయనకు అనిపించింది. ఆయన వారిని తన పంక్తినే భోజనానికి కూచోబెట్టాడు. రాజోచితమైన భోజన పదార్థాలూ, మేలురకం బియ్యంతో తయారుచేసిన అన్నమూ వడ్డించారు.

అందరూ ఆసక్తితో భోజనం ప్రారంభించారు. కాని అన్నదమ్ములలో పెద్దవాడు మాత్రం ముక్కులు మూసుకుని బాధపడసాగాడు. రాజు అతనిని, "భోజనం ఇంత రుచిగా ఉంటే నీవు ముట్టనైనా ముట్టలేదేం?" అని అడిగాడు.

"రాజా, ఈ అన్నం శవాలు కాలిన పొగ వాసన, ఎలా నోట్లో పెట్టుకునేది?" అన్నాడు పెద్దవాడు. రాజు మిగిలిన వారిని, "మీకేమైనా వాసనకొడుతున్నదా?" అని అడిగాడు.

"మాకీ అన్నం కమ్మని వాసన కొడుతున్నది," అన్నారు వాళ్ళు.

అయినప్పటికీ రాజు తన ఉద్యోగులను పిలిపించి వివరంగా ఆరాతీయగా ఆ పూట వండిన బియ్యం శ్మశానాన్ని ఆనుకుని ఉండే పొలంలో పండినవేనని రుజువయింది. ఇది విని రాజు నిర్ఘాంతపోయి, పెద్దవాడి శక్తికి సంతోషించి, అతనికి వేరే అన్నం వండించి భోజనం పెట్టాడు.

ఆ తరవాత రాజు రెండోవాడికి పరిచర్యలు చేయటానికిగాను ఒక దాసీని పంపాడు. ఆ దాసీ చిన్నతనం నుంచీ రాజభవనంలోనే పెరిగినది. అయినా అది సమీపానికి రాగానే రెండోవాడు, "ఛీ, ఛీ, అవతలికి పో. నీ దగ్గిర మేకల వాసన," అనేశాడు. రాజు ఆ దాసీని పిలిపించాడు. అది అంతదూరంలో నిలబడితే ఆయనకు గంధం వాసనా, కస్తూరి వాసనా, పూలవాసనా మాత్రమే కొట్టింది.

అయినా రెండోవాడు దాని వద్ద మేకల కంపు అనటంలో నిజం ఏమైనా ఉన్నదా అని ఆరాతీయగా, ఆ దాసీదాని తల్లి పురుట్లోనే పోయిందనీ, కొంతకాలం ఆ పిల్ల మేక పాలుతాగి పెరిగిందనీ తెలిసింది.

ఆ రాత్రి మూడోవాడికి రాజు ఎంతో శ్రద్ధగా పక్క వేయించాడు. మంచంమీద ఒకదానిపై ఒకటి ఏడు హంసతూలికా తల్పాలు పరిచి, వాటిపైన పాల నురుగులాటి తెల్లని, మెత్తని దుప్పటి వేసి మూడోవాడికి శయ్య అమర్చారు. వాడు దానిపైన పడుకుని కొంతసేపు నిద్రపోయాడు.

కాని ఒకరాత్రివేళ వాడు, "బాధ, బాధ!" అంటూ లేచాడు. నౌకర్లు వచ్చి, "ఏం జరిగింది?" అని అడిగారు.



"ఈ పక్కలో వెంట్రుక ఏదో ఉండి నాకు గుచ్చుకున్నది. ఇదుగో దాని గుర్తు!" అంటూ మూడోవాడు తన శరీరం మీద ఎర్రగా, వంపు తిరిగి ఉండిన వెంట్రుక గుర్తు చూపించాడు.

నౌకర్లు రాజును పిలుచుకువచ్చారు. రాజు స్వయంగా పరుపులు ఏడూ తీయించి వెంట్రుక కోసం వెతికించాడు. ఏడు పరుపులకూ అడుగున ఒక వెంట్రుక ఉండనే ఉన్నది. దాన్ని మూడోవాడి శరీరంపైన గల గుర్తుకు పెట్టి చూస్తే సరిగా సరిపోయింది.

మర్నాడు ముగ్గురు అన్నదమ్ములూ రాజు వద్దకు వచ్చి, "రాజా, మా ముగ్గురి శక్తులలో ఎవరిది గొప్పది?" అని అడిగారు. ఎవరిశక్తి గొప్పదో నిర్ణయించటం రాజుకు సాధ్యంకాలేదు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఆ అన్నదమ్ములు ముగ్గురూ అపూర్వ శక్తులు కల వారే, కాని వారిలో ఎవరి శక్తి నిజంగా ఎక్కువైనది? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మొదటి వారిద్దరి శక్తులూ నిజం కావచ్చు, కాకపో వచ్చు. వాటికి ప్రత్యక్ష ప్రమాణం ఏమీ లేదు. శ్మశానం పక్కన పొలంలో పండిన వరిధాన్యమూ, మేకపాలు తాగిన దానీదీ కేవలం కాకతాళీయం అయి ఉండవచ్చు. లేదా, వారికా సంగతులు ఏదో ఒకవిధంగా ముందే తెలిసినా తెలిసి ఉండవచ్చు. కాని మూడోవాడి శక్తి గురించి అటువంటి సంకోచానికి తావు లేదు. ఏడు పరుపుల కింద ఉన్న వెంట్రుక ఆనవాలు ప్రత్యక్షంగా వాడి శరీరంపైన కనిపిస్తున్నది. అందుచేత వాడి శక్తే ఎక్కువైనది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.





# సువర్ణ హస్తం

పూర్వం దక్షిణ మధురలో ఒక పాండ్య రాజు రాజ్యంచేస్తూ ఉండేవాడు. ఆయన ప్రజలను బిడ్డల్లాగా చూసుకునేవాడు. ఎవరికీ ఎలాటి అన్యాయమూ జరగనిచ్చేవాడు కాడు. ఆయన రాజ్యం రామరాజ్యంలా గుండేది. దేశంలో ఎవరికి ఎలాటి కష్టం వచ్చినా ఆ సంగతి చారులద్వారా రాజుకు వెంటనే తెలుస్తూ ఉండేది; ఆయన సాధ్యమైనంతవరకు వారివారి కష్టాలను నివారణ చేస్తూ ఉండేవాడు. ఇదిగాక ఆయన తరుచు మారువేషంలో తిరుగుతూ ప్రజల యోగ క్షేమాలు స్వయంగా తెలుసుకుంటూ ఉండేవాడు. అందుచేత ఆయన రాజ్యంలో ప్రజలు చాలా సుఖపడేవారు.

ఒక రాత్రి రాజు మారువేషంలో నగరమంతా తిరుగుతూ పదిగంటలవేళ ఒక బ్రాహ్మణ వీధిలోకి వచ్చాడు. ఒక ఇంటి దగ్గిరికి వచ్చేసరికి ఆయనకు లోపలినుంచి ఒక స్త్రీ దుఃఖిస్తూ ఉండటమూ, ఒక పురుషుడు ఆమెను సముదాయిస్తూ ఉండటమూ వినిపించింది. రాజు ఆ ఇంటి ముందు నిలబడి లోపల జరిగే సంభాషణ ఆలకించాడు.

సంగతేమంటే, ఆ ఇంట్లో ఒక బ్రాహ్మణ దంపతులు ఉంటున్నారు. వారికి పిల్లలు లేరు. మర్నాడే భర్త ఏదో పనిమీద కాశీకి ప్రయాణమై వెళుతున్నాడు. ఆయన తిరిగి వచ్చేదాకా ఆ ఇంట్లో బిక్కు బిక్కుమంటూ ఒంటరిగా ఉండాలే అని భార్య చింతిస్తున్నది.

"ఆరుమాసాలు నిండి అమావాస్య రాగానే నేను తిరిగి వస్తానుగద. ఈ ఆరు నెల్లకీ సరిపోయే సంబారాలన్నీ ఇంట్లో చేర్చి ఉంచాను. అందుచేత నువ్వు యింతగా విచారించవలిసిన పని ఏమీ లేదు," అంటున్నాడు భర్త.

వి. రమాదేవి



"సంబారాలు తక్కువైపోతాయని నేనేమీ బెంగపడటంలేదు. ఆడదాన్ని, అందులోనూ ఒంటరిదాన్ని, ఆరుమాసాల పాటు కొంపలో తోడు లేకుండా ఉండా లంటే ఎంతకష్టం చెప్పండి! ఏ రాత్రి ఏ దొంగాడు లోపల జొరబడతాడో అని ప్రాణాలు పిచపిచలాడతాయిగద!" అంటున్నది భార్య.

"ఓసి పిచ్చిదానా, పెట్టని కోటలాగా మన రాజుగారుండి ప్రజలని కంటికి రెప్ప లాగా కాపాడుతుంటే దొంగల భయమా? ఇంకా నయం! మన దేశంలో ఎక్కడన్నా దొంగలు పడ్డట్టు ఎప్పుడైనా విన్నావా? ఇంత రాజ్యాన్ని కాపాడే మహారాజు నిన్ను దొంగల భయంనుంచి కాపాడలేక పోతాడనా నీ భయం? అటువంటి పిచ్చి భయాలు మాను," అన్నాడు భర్త.

ఈ సంభాషణ విని రాజు ముందుకు సాగిపోయాడు. మర్నాడు ఆ ఇంటి యజమాని కాశీకి బయలుదేరి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి రాజు మారువేషంలో ఆ వీధికి వచ్చి ఆ ఇంటిముందు తెల్లవార్లూ కాపలా కాశాడు. అది మొదలు ఆయన రోజూ రాత్రి వేళ ఆ ఇంటికి కాపలా ఉంటూవచ్చాడు.

రోజులూ, వారాలూ, నెలలూ గడిచి పోయాయి. ఆరు నెలలూ నిండి అమా



వాన్య వచ్చింది. రాజు తన అలవాటు ప్రకారం ఆ యింటిముందు కాపలా కాయటానికి మారువేషంలో వచ్చాడు.

ఆయన వాకిలి సమీపించేసరికల్లా లోపలి నుంచి ఎవరిదో మగవాడి గొంతు వినిపించింది. ఇంటి యజమాని లేని సమయంలో పరపురుషుడెవరో లోపల ప్రవేశించి ఉంటాడని అనుమానించి రాజు తలుపు తట్టాడు. కాని ఆయన మరుక్షణమే తలుపు సందులో నుంచి చూసేసరికి ఇంటి యజమాని కాశీ నుంచి తిరిగి వచ్చి తన భార్యతో మాట్లాడుతూ ఉండటం రాజు కంటపడింది. ఆయన కంగారుపడిపోయాడు. తొందరపడి తలుపు తట్టటం చాలా పొరపాటయింది. తాను కాశీకి వెళ్ళిన కాలంలో ఎవరో వచ్చి తన వాకిలి తలుపు తట్టుతూ ఉండి ఉంటారని ఆ బ్రాహ్మణుడు అనుమానపడగలడు. తాను చేసిన ఈ పొరపాటు సరిదిద్దుకునే ఉద్దేశంతో రాజు గబగబా ఆ వీధిలోని మరికొన్ని వాకిళ్ళ తలుపులు కూడా తట్టి చీకట్లో పడి వెళ్ళిపోయాడు.

తలుపు తట్టినది ఎవరా అని తెలుసుకోవటానికి ఇళ్ళలోవారంతా బయటికి వచ్చారు. అందరూ కూడబలుక్కుని, ఇది ఎవరో దొంగ చేసిన పని అయి ఉంటుందనుకున్నారు. ఆ నగరంలో అటువంటి



సంఘటన ఎన్నడూ జరిగి ఉండలేదు. అందుచేత వారు రాజుగారికి ఈ విషయమై ఫిర్యాదు చేయాలని నిశ్చయించుకున్నారు.

మర్నాడు వారందరూ రాజుగారి సభకు హాజరయి, "మహా రాజా, ఇంతకాలంగా మేమంతా తమ అండను ఎలాటి చోర భయంగాని, ఇతర భయాలుగాని లేకుండా సుఖంగా జీవనంచేస్తూ ఉన్నాం. అయితే నిన్న రాత్రి మా వీధిలో ఒక సంఘటన జరిగింది. అది మాకు ఆందోళన కలిగించేదీ, మీకు అపకీర్తి కరమైనదీనూ. ఎవరో దొంగ కిందటి రాత్రి మా వీధికి వచ్చి మా ఇళ్ళ తలుపులు తట్టి పారిపోయాడు. వాణ్ణి పట్టుకుని శిక్షించాలని మా ప్రార్థన," అని విన్నవించుకున్నారు.

వెంటనే రాజు తన ప్రధానమంత్రికేసి తిరిగి, "వీళ్ళు చెప్పే నేరం చేసినవాడికి మనం విధించే దండన ఏమిటి?" అని అడిగాడు.

"పౌరులను భయపెట్టిన ఆ దుర్మార్గుడి కుడిచెయ్యి నరకటమే ఈ నేరానికి తగిన శిక్ష, మహారాజా!" అని మంత్రి సమాధానం చెప్పాడు.

వెంటనే రాజు తన కత్తి దూసి తన ఎడమచేత్తో కుడిచేతిని నరుక్కున్నాడు. తరవాత ఆయన అందరి ఎదటా జరిగిన సంగతి యావత్తూ చెప్పేశాడు. అది విని అందరూ దుఃఖితులై, రాజుగారి ధర్మబుద్ధిని కొనియాడారు. తరవాత ఒక బంగారు చెయ్యి చేయించి రాజుగారి మోచేతికి అమర్చారు. అందరూ కలిసి సుందరేశ్వరస్వామి ఆలయానికి వెళ్ళి ప్రార్థనలు చెయ్యగా, స్వామి వారు అనుగ్రహించి రాజుగారి కుడిచెయ్యి మామూలు చెయ్యిలాగే ఉండేటట్టు కటాక్షించారు.

తళతళా మెరిసే ఆ బంగారుచెయ్యి కారణంగా ఆ రాజుకు సువర్ణహస్త పాండ్యుడు అనే పేరు వచ్చింది.





# గుడ్డి దర్బారు

పూర్వం హైదరాబాదు నగరం సమీపంలో షకురా అనే పేదవాడొకడు ఉండేవాడు. వాడు నవాబుల అస్థానంలో ·ఏ కొద్దిపాటి ఉద్యోగమైనా సంపాదించి, కనీసం నెలకు రెండు రూపాయల జీతమైనా తీసి, దానితో పొట్టపోసుకుందామని రాజధానికి వచ్చాడు. ఆ కాలంలో రెండురూపాయల నెలజీతం కూడా బతుకుతెరువుగానే ఉండేది.

అయితే షకురా ఎంత ప్రయత్నించినా ఏమీ లాభం లేకపోయింది. వాడు ఎన్ని అర్జీలు పెట్టుకున్నా, సహాయపడే నాథుడు లేనందున, అన్నీ బుట్టదాఖలయాయి.

చివరకు షకురా సాహసించి ఒక పని చేశాడు; వాడు ఒక కంసాలి సహాయంతో ఒక మొహరు చేయించుకున్నాడు, అది పట్టుకుని ప్రథాన న్యాయస్థానం వెలపల ఒకచోట కూచుని, తనముందు ఒక బల్ల పెట్టుకున్నాడు. లోపలికి అర్జీలు పట్టుకువెళ్లే వారినందరినీ పిలిచి వాళ్ళ అర్జీలపైన ఆ మొహరుతో ముద్రవేసి, అర్జీకి ఒక పైస చొప్పున వసూలుచెయ్యసాగాడు. ఇదంతా ప్రభుత్వం చేసిన ఏర్పాటేకాబోలుననుకుని అర్జీదార్లు తమ అర్జీలపై మొహరు ముద్ర వేయించుకుని ఆ తరవాతనే తమ కాగితాలను అధికార్లకు దాఖలు చేసుకోసాగారు. త్వరలోనే ఇది పరిపాటి అయిపోయింది. న్యాయస్థానోద్యోగులు కూడా ఈ ముద్రకు అలవాటైపోయారు, కాని ఆ ముద్ర ఎందుకు ఉన్నదీ, ఎవరు వేస్తున్నదీ, ఏ అధికారంతో వేస్తున్నదీ ఆలోచించినవారు లేరు.

షకురా కొద్దికాలంలోనే బోలెడంత సంపాదించుకున్నాడు. తన రహస్యం బయటపడిపోతుందేమో, ఇది నవాబుదాకా పోతే తన తల తీయిస్తాడని వాడికి భయం పట్టుకున్నది. అందుకు వాడొక ఉపాయం చేశాడు; తాను వేసే ముద్రలకు ఒక పైసా

గ్రంధి వీరవెంకటసత్యజగన్నాధరావుగుప్త

వసూలు చెయ్యటానికి ఖదులు రెండేసి వసూలుచేసి, అందులో ఒకటి తాను తీసు కుని, రెండవది నిలవవేసి ఉంచసాగాడు.

ఇలా పది సంవత్సరాలు గడిచినాక ఒక నాడు ఏ కారణంచేతనో షకురా కచేరీకి వెళ్ళలేకపోయాడు. అనాడు వచ్చిన అర్జీల పైన మొహరు ముద్ర లేదు. "వీటిపైన ముద్ర లేదు. ఇవి చెల్లవు," అన్నారు గుమాస్తాలు. ఈ వ్యవహారం పెద్ద అధికార్లదాకా వెళ్ళింది. వాళ్ళు, "అసలు ఈ ముద్ర ఏమిటి? దీన్ని ఎవరు వేస్తున్నారు?" అని ఆరాతీశారు.

పాత అర్జీలు తెప్పించి ఆ ముద్రను పరీక్షిస్తే అందులో ఇలా ఉంది: "అంధే సర్కార్—పీతల్ దర్వాజా—షకురా మోహర్." అది సర్కారు మొహరు కానే కాదు. ఈ సంగతి నవాబుదాకా వ్యెళింది. షకురాను పట్టి తీసుకురమ్మని ఆయన ఆజ్ఞాపించాడు. భటులు షకురాను తెచ్చి నవాబు ఎదట హాజరుపెట్టారు. ఇలా ఎప్పటికైనా జరుగుతుందని వాడు అనుకుంటూనే ఉన్నాడు, కనక వాడు తాను పోగుచేసి ఉంచిన పైకం వెంటబెట్టుకుని నవాబు వద్దకు వెళ్ళాడు.

నవాబు వాణ్ణి, "ఎవరు నీవు? ఈ మొహరు నీదేనా? ఎవరు నీకు అధికారం ఇచ్చారు?" అని అడగవలిసిన ప్రశ్నలన్ని అడిగాడు. షకురా దాచకుండా జరిగినదంతా నవాబుకు విన్నవించి, "తమ పంతు ఇప్పటికి ముప్పైవేలు వసూలయింది. ఇదుగో ఆ డబ్బు!" అని చెప్పాడు.

వాడి చాకచక్యానికి నవాబు సంతోషించి వాడికి ఆ పనే ఒక ఉద్యోగంగా ఖాయంచేసి, మొహరులో ఉన్న "అంధే సర్కారు" అన్న మాటలలో "సర్కారు" అనేది మాత్రం ఉంచి "అంధే" అనే మాట చెక్కించేశాడు.

షకురా మొహరు చాలాకాలం అమలులో ఉంది.





# నిజమైన విశ్వాసం

ఒకనాడు కొందరు గొల్లస్త్రీలు ఒక ఊళ్ళో పాలు అమ్ముకుని తమ గ్రామానికి తిరిగి పోతూండగా ఒక ఇంటి వసారాలో ఒక శాస్త్రుల్లుగారు పురాణం చదువుతూ ఉండటం వారికి వినిపించింది. గొల్లస్త్రీలు ఆగి పురాణం వినను కూడా లేదు. పురాణం శాస్త్రుల్లు చెబుతున్న ముక్క ఒక్కటిమాత్రమే వారి చెవుల బడింది.

"ఓం అనే ఒక్క అక్షరం చాలు, దాని సహాయంతో మహాసముద్రాలను అవలీలగా దాటవచ్చు!" అని ఆయన చెబుతున్నాడు.

ఈ ఒక్క ముక్కా గొల్లస్త్రీల మనసులలో బాగా నాటుకు పోయింది. వారి అమాయిక బుద్ధికి అది పరమ సత్యమనే తోచింది. వారు రోజూ నాలుగణాల డబ్బులు కేవు కింద ఖర్చుపెట్టి తమ గ్రామంనుంచి వచ్చేటప్పుడూ, గ్రామానికి తిరిగి వెళ్ళేటప్పుడూ నది దాటాలి.

ఓం అనే మాటతో మహాసముద్రాలే దాటవచ్చునని అన్నీ తెలిసిన శాస్త్రుల్లుగారు చెబుతూంటే వాళ్ళు నదిని పడవలో దాట వలిసిన అవసర మేమున్నదీ? రోజూకు నాలుగణాల డబ్బులు మిగుల్చుకోవచ్చునే?

పురాణం శాస్త్రుల్లుగారు చెప్పిన మాట యందు వారికి ఎంత గట్టి గురి కుదిరిందంటే, నది దగ్గిరికి వచ్చినాక వారు పడవ కోసం చూడక, "ఓం" అనుకుని నది మీదుగా నడక సాగించారు. విశ్వాస ప్రభావం చేత వారు నీటిమీద నడవగలిగి అవతలి ఒడ్డు చేరుకున్నారు.

అదిమొదలు ఆ గొల్లస్త్రీలు నదిమీదిగా నడిచి వచ్చి, పాలు అమ్ముకుని, ఇంటికి తిరిగి పోసాగారు.

ఒక నెల గడిచింది. గొల్లస్త్రీలు తమలో తాము కూడబలుక్కున్నారు: "ఆ శాస్త్రుల్లు గారి ధర్మమా అంటూ మనం రోజూకు

స్వామి రామ తీర్థ

పావలా చొప్పున ఆదా చేసుకుంటూ వస్తున్నాం. ఆయన మనకు నది దాటే రహస్యం చెప్పకపోతే ఏమైఉండును. అందుచేత ఆయనకు మనం కృతజ్ఞత చూపాలి. మనం ఒకనాడు ఆయనను మన ఇంటికి పిలిచి భోజనం పెడదాం."

గొల్లస్త్రీలు భోజనానికి అహ్వానించే సరికి బ్రాహ్మడు సరే నన్నాడు. ఆయనకు విందు చేసే రోజుకూడా నిర్ధారణ అయింది. అనాడు ఆయనను పిలుచుకు పోవటానికి ఆ స్త్రీలలో ఒకతె వచ్చింది. ఇద్దరూ నదిదాకా వచ్చారు. బ్రాహ్మడు నిలబడిపోయాడు.

"ఆగారేం, శాస్త్రుల్లుగారూ? పోదాం రండి," అన్నది స్త్రీ.

"పడవ రానీ," అన్నాడు బ్రాహ్మడు.

"పడవ దేనికండీ? నీళ్ళమీద నడిచి పోయేదానికీ!" అంటూ స్త్రీ నదిమీదుగా బయలుదేరింది. కాని బ్రాహ్మడు ఆమెను వెంబడించ లేదు.

ఆ స్త్రీ తిరిగి వచ్చి, "అయ్యా, మీ పుణ్యానే గదా మేము రోజూ కేదిచ్చుకోకుండా నది దాటుతున్నాం" అంటూ తాము అనాడు బ్రాహ్మడు చెప్పగా విన్న మాటలూ, వాటి వల్ల తాము పొందిన మేలూ చెప్పింది.

"అలాగా? అయితే నేనుకూడా ఓంకారంతో నది దాటటం అభ్యసిస్తాను!" అన్నాడు బ్రాహ్మడు. తరవాత ఆయన నది తీరాన ఉన్న వారి సహాయంతో నడుముకు ఒక పగ్గం కట్టుకుని, కొస వాళ్లకిచ్చి, "నేను మునిగే పక్షంలో నన్ను బయటికి లాగండి," అని హెచ్చరించి నదిలో కాలు పెట్టాడు. కాని ఆయన నీటిమీద తేలనేలేదు; ఒడ్డున ఉన్నవాళ్ళు నీళ్ళల్లోంచి బయటికి లాగారు.

ఓంకారం తనను నది దాటించగలదన్న నమ్మకం బ్రాహ్మడికి ఉన్నట్టయితే నడుముకు తాడు కట్టి, ఒడ్డున ఉన్నవాళ్ళను సహాయం అడిగి ఉండడు. అందుకే ఆయన నీటిమీద నడవలేకపోయాడు.






పిండారబోసిన వెన్నెలలో తాతయ్య తాంబూలం నములుతూ ఏదో ఆలోచిస్తూ కూచున్నాడు. చుట్టూ చేరిన పిల్లలు తాతయ్య బొడ్డులో ఉన్న పొడుంకాయకేసీ, తాతయ్యకేసీ చూసి, ఏం శ్లోకం చదువుతాడా అని చూస్తున్నారు:

అంతలో మందారచెట్ల వేపు నుంచి ఏదో చప్పుడు వినపడింది. "ఏమిటది?" అని పిల్లలు ఒకరినొకరు ప్రశ్నించుకుని బిత్తర పోయారు. తాతయ్య తనలో తాను నవ్వుకుంటూ, పొడుంకాయ తీసి ఒక పట్టుపట్టి పీల్చి, ఇలా చదివాడు:

"శబ్ద మాత్రన్న భేతవ్య
మజ్ఞాత్వా శబ్ద కారణం;
శబ్దహేతుం పరిజ్ఞాయ
సుమంత్రో గౌరవం గతః"

ఈ శ్లోకం చదివి, "అంటే అర్థమేమిటని అడగబోతారుకాదూ? అదీ చెబుతాను. ఆ శ్లోకానికి అర్థమేమిటంటే: ఏదైనా చప్పుడు ఎందుకు పుట్టిందీ, ఎలా పుట్టిందీ తెలియకుండా భయపడటం ఉందే అది మంచిది కాదు. సుమంత్రుడనేవాడు శబ్దానికి కారణం తెలుసుకోవటం చేతనేకదా గౌరవం పొందాడూ అని!" అన్నాడు.

పిల్లలు సంతోషంతో చప్పట్లు కొట్టి, "కథ చెప్పు, తాతయ్యా!" "ఆ సుమంత్రుడెవరు, తాతయ్యా?" "ఆ శబ్దం ఏమిటి, తాతయ్యా?" అని ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఉండండ్రా! ఆ కథ చెబుతానుగా!" అంటూ తాతయ్య ఇలా చెప్పాడు:

శ్రీపర్వతం అని ఒక చోటు. ఆ శ్రీపర్వతం మధ్యగా బ్రహ్మపురమనే నగరం. దానికి శ్రీధరుడని రాజు. ఇందాక చెప్పిన సుమంత్రుడు ముఖ్యమంత్రి. శ్రీధరుడు ప్రజలను చక్కగా పరిపాలించేవాడంటే అందుకు సగం కారణం సుమంత్రుడే.

తాతయ్య కథలు:—8 రచన: సి. శేషాద్రి

అయిందా? ఉన్నట్టుండి నగరంలో ఒక పుకారు పుట్టింది. ఏమనీ? శ్రీపర్వతంమీద ఘంటాకర్ణుడనే రాక్షసుడొకడు చేరాడని. ఇది ఉత్త పుకారనుకునేరు. పర్వతంమీది నుంచి తరుచు గంట మోగించిన చప్పుడు వినిపించేది. ఆ చప్పుడు విని ప్రజల పై ప్రాణాలు పైనే పోయాయి. ఘంటాకర్ణుడి భయంతో చాలామంది నగరం విడిచిపెట్టి పోయారు. పోనివారు ప్రాణాలు అరచేత పట్టుకుని భయంతో దడదడలాడిపోతున్నారు.

ఇది చూసి రాజుకు కష్టం వేసింది. ఆయన మంత్రి అయిన సుమంత్రుడితో, "మంత్రీ, ప్రజలకు ఈ భయం పోగొట్టటం మన విధి. అందుకేదైనా ఉపాయం నువే ఆలోచించాలి!" అన్నాడు.

సుమంత్రుడు అలాగే నన్నాడు. ఎలాగైనా బుద్ధిమంతుడు గనక ఆ గంట మోగటానికి కారణం తెలుసుకోవటం తన ప్రథమ కర్తవ్యం అనుకుని అతడు ఆ చప్పుడు వినిపించే దిక్కుగా వెళ్ళాడు. తీరా వెళ్ళి చూస్తే రాక్షసుడూ, గీక్షసుడూ లేడు. ఒక కోతి చెట్ల మీద తిరుగుతూ గంట వాయిస్తున్నది.

దానికా గంట ఎలా దొరికిందని అడగరేం? ఒక దొంగ ఒకనాడు ఆ గంటను ఎక్కడో దొంగిలించి అటుగా పోతుంటే ఒక పులి వాణ్ణి చంపింది. ఆ గంటను ఒక కోతి ఎత్తుకుపోయి తనకు సరదా పుట్టినప్పుడల్లా వాయిస్తున్నది.

గంట చప్పుడుకు కారణం తెలిసిపోయిందిగా? సుమంత్రుడు పళ్ళూ ఫలాలూ ఒక చోట పెట్టి కోతిని ఆకర్షించి, అది దూరంగా ఉంచిన గంటను కాస్తా తీసుకుని నగరానికి వచ్చేశాడు. జరిగిన సంగతి తెలిసి ప్రజలు భయపడటం మానుకున్నారు. రాజు సుమంత్రుణ్ణి ఘనంగా గౌరవించాడు.

"చూశారా? ఉత్తనే చప్పుళ్ళు చూసి భయపడరాదు. చప్పుడుకు కారణం ఏమిటో తెలుసుకోవాలి!" అన్నాడు తాతయ్య.






## 3

ఇక్కడ రాజుగారు ఈప్రకారంగా తన కుమార్తెకు పెళ్ళి ప్రయత్నాలు చేస్తుంటే, అక్కడ తన ప్రియురాలికోసం ఎదురు చూస్తున్న రాజకుమారుడు ఏంచేస్తున్నాడు?

అతను ఎంతసేపు చూసినా రాజకుమార్తె తిరిగి రాలేదు. అతను దిగిన ప్రదేశం కటిక ఎడారి. కనుచూపుమేరదాకా ఇసక దిబ్బలు తప్ప ఒక చెట్టుగాని, చేమగాని, ఆఖరుకు గరికగాని లేదు. అంతకంతకూ సూర్యుడు పైకి రావటంవల్ల వేడి రెచ్చిపోతున్నది. గాలి గట్టిగా వీస్తూ ఇసుకను అటూ ఇటూ చెరుగుతున్నది; చిన్న చిన్న ఇసుక దిబ్బలను ఒక చోటినుండి ఊడ్చి మరొకచోట పోగుపెడుతున్నది.

రాజకుమారుణ్ణి ఆకలి దప్పులు బాధిస్తున్నాయి. ఎక్కడైనా ఒక చిన్న చెలమ కనిపిస్తుందేమోనని అతను ఆ ఇసుక దిబ్బల మధ్యగా కాళ్ళు పడిపోయేలాగ తిరిగాడు. ఎత్తునుంచి చూస్తే మరింత దూరం చూడవచ్చుననుకుని వాడు అన్నిటికన్న ఎత్తయిన ఇసుకదిబ్బ మీదికి ఎక్కాడు. అడుగు తీసి అడుగు పెట్టినప్పుడల్లా మోకాలుదాకా ఇసుకలో దిగబడిపోతూండటంచేత ఎక్కటం మహా ప్రయాస అయింది. వాడు ఆ దిబ్బ పైభాగాన్ని చేరుకునేసరికి మహా పర్వతాన్ని ఎక్కినంత శ్రమ తోచింది.

వాడు దిబ్బ పైభాగాన్ని చేరుకుని చుట్టూ కలయచూసేటందుకు తల ఎత్తాడో

సి. మాధవరావు




లేవే, అంతలోనే కాళ్ళకింద ఇసక కరిగి పోతున్నట్టయింది. వాడు అగాధంలోకి దిగబడిపోతున్నట్టయింది. వాడు కొంత దూరం అలా జారి, చివరకు ఎలాగో కాలు నిలవదొక్కుకో గలిగాడు. అప్పుడు తల ఎత్తి చూసేసరికి వాడికి ఒక దివ్యమైన పళ్ళచెట్ల తోపు కనిపించింది. అక్కడవున్న వన్నీ పళ్ళచెట్లే. ప్రతి చెట్టూ నవనవలాడు తున్నది. అన్ని చెట్ల కొమ్మలకూ గుత్తులు గుత్తులుగా, బరువుగా పళ్ళూ, పచ్చి కాయలూ ఉన్నాయి.

ఆ చెట్లనూ, పళ్ళనూ చూడగానే రాజ కుమారుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.



వాడు తోపులో ప్రవేశించి ఎర్రగా పండి సువాసన కొట్టే కొన్ని పళ్ళను కోసుకుని ఆవురావురుమని తినేశాడు. ఆ పళ్ళు మహా రుచిగా ఉన్నాయి.

వాటిని తింటుంటే రాజకుమారుడి ఆకలీ దప్పీ కూడా తీరిపోయాయి.

అలా వాడు ఎర్ర పళ్ళతో కడుపు నింపు కునేసరికి నిద్ర వచ్చింది. వాడు చల్లని నీడలో ఒక చెట్టు బోదె నానుకుని సుఖ నిద్రలో మునిగిపోయాడు.

వాడు కొంతసేపటికి నిద్ర మేలుకుని చేతులతో మొహం నిమురుకునేసరికి చేతికి పెద్ద బవిరిగడ్డం తగిలింది. వాడు నిర్ఘాంత పోయాడు. ఏమి జరిగినదీ వాడికి అర్థం కాలేదు. వాడికి ఏనాడూ గడ్డం లేదు. ఈ విషయమే ఆలోచిస్తూ ఆశ్చర్యపోతూ ఉంటే వాడికి మళ్ళీ ఆకలి వేసింది.

కాని ఈసారి వాడు ఎర్రపళ్ళ జోలికి పోలేదు. వాటిని చూస్తే వాడికి అనుమానం కలిగింది. అందుచేత వాడు ఈసారి పచ్చ పళ్ళ చెట్లను సమీపించి, కొమ్మలు వంచి, గుత్తులు గుత్తులుగా వేళ్ళాడే ఆ పళ్ళలో బాగా పండి సువాసనలు వెదజల్లుతున్న పళ్ళను కోసి కడుపునిండా తినేశాడు. ఈ పళ్ళు ఎర్రపళ్ళకన్న కూడా రుచిగానూ,



రసంకలిగి ఉన్నాయి. అందుచేత వాడా పళ్ళను ఎక్కుతొక్కునట్టుగా తిని మళ్ళీ చెట్టుకు చేరగిలబడి నిద్రపోయాడు.

మళ్ళీ వాడికి నిద్ర మెలకువ వచ్చేసరికి సూర్యాస్తమానమయి, చీకటి పడబోతున్నది. వాడు బద్ధకంగా ఒళ్ళు విరుచుకోవటంలో తల చెట్టుబోదెకు కొట్టుకున్నది. ఆ తల మామూలుకన్న ఎక్కువ బరువుగా ఉన్నట్టు కూడా వాడికి అనిపించింది. తల తడివి చూసుకోవటంలో వాడి చేతికి రెండు లావు పాటి కొమ్ములు తగిలాయి! దీనికి తోడు వాడి గడ్డం మూరెడు ప్రమాణం పెరిగి తెల్లగా నెరిసిపోయి ఉన్నది!

తన ఆకారం ఎలా ఉన్నదీ తలుచుకుంటునే వాడికి గుండెలు అవిసిపోయాయి. "ఇదేం ప్రారబ్ధం? వెళ్ళిన రాజకుమార్తె రాలేదు. నా అవతారం ఇలా మారిపోయింది. ఒకవేళ ఆమె వచ్చినా ప్రయోజనం శూన్యం. ఈ రూపంలో ఆమె నన్ను పోల్చుకోలేదు. ఒకవేళ పోల్చుకుంటేమటుకు, ఈ గడ్డంతోనూ, కొమ్ములతోనూ ఉన్న నన్ను ఎలా ప్రేమిస్తుంది? నేను సమస్తమూ కోల్పోయాను—రాజకుమార్తెనూ, కొయ్యగుర్రాన్నీ కోల్పోయాను; నన్ను నేనే కోల్పోయాను!" అంటూ వాడు విలపించి విలపించి, ప్రాణం సొమ్మసిల్లి మళ్ళీ నిద్రపోయాడు.



ఆ నిద్రలో వాడికొక కల వచ్చింది. ఆ కలలో ఒక వృద్ధుడు వాడి ఎదట నిలబడి వాడి తల నిమురుతూ, "ఎందుకు, నాయనా, విచారిస్తున్నావు?" అని అడిగాడు.

రాజకుమారుడు వృద్ధుడికి తన గొడవ అంతా చెప్పుకున్నాడు.

"విచారించకు. చెట్ల కింద రాలి ఎండి పోయిన ఎర్ర పళ్ళూ, పచ్చ పళ్ళూ తిన్నా వంటే నీ రూపు మళ్ళీ మారిపోతుంది, నీ గడ్డాలూ, మీసాలూ, కొమ్ములూ రాలి పోతాయి. అసలు ఈ ప్రాంతం వదిలి వెళ్లిపో, బాబూ. ఇది భూతాలుండే స్థలం. అవి ఇంకా నిద్ర లేవకపోవటంచేత నువు బతికి పోయావు. అవి లేచే వేళ అయింది," అన్నాడు వృద్ధుడు.

రాజకుమారుడీ మాటలకు నిర్ఘాంత పోయాడు. వాడు నిద్ర లేచి కళ్ళు నులుము కుని పైకి చూస్తే నడి ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తూ కనిపించాడు. చలిగాలి వీస్తు న్నది. ఎడారి ఇసుక ఇప్పుడు కాలటంలేదు. కలలోని వృద్ధుడి సలహా ప్రకారమే వాడు చెట్ల కింద దొరికిన ఎండు కాయలను, ఎర్ర వాటినీ, పచ్చవాటినీ ఏరుకుని తిన్నాడు. తలా, ముఖమూ తడివి చూసుకుంటే గడ్డాలూ, మీసాలూ, కొమ్ములూ పోయి నట్టు స్పష్టమయింది.



తరవాత వాడు కొంత తుంగ పీకి దానితో ఒక బుట్ట అల్లుకున్నాడు. ఆ బుట్టలో ఇన్ని ఎండిన ఎర్ర పళ్ళూ, పచ్చ పళ్ళూ, పండిన ఎర్ర పళ్ళూ, పచ్చ పళ్ళూకూడా నించుకుని, గబగబా ఆ తోపును దాటి దూరంగా బయలుదేరాడు.

వాడి ఉద్దేశం తన దేశానికి పోవాలని. కాని అది ఎటుగా ఉన్నదీ వాడికి తెలియదు. చేసేదిలేక వాడు ముక్కుసూటిగా నడిచాడు. ఎంతదూరం వెళ్ళినా ఇసుక తప్ప మరేమీ కనబడలేదు. ఆకలి అయినప్పుడు ఎండిన పళ్ళు తింటూ, అలిసిపోయినప్పుడు ఇసుకలో పడుకుంటూ ఏడు పగళ్ళూ, ఏడు రాత్రులూ నడిచి ఎలాగైతేనేం ఒక రహదారి చేరుకున్నాడు.

వాడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. వాడు రహదారి పక్కన చతికిలబడి విశ్రాంతి తీసుకున్నాడు.

కొంచెంసేపటికి ఒక మనిషి ఒక కంచర గాడిదనెక్కి రహదారివెంట వచ్చాడు. రాజకుమారుడు ఆ మనిషిని పలకరించి ఆ రహదారి ఎక్కడికి పోతుందని అడిగాడు. ఆ మనిషి చెప్పిన మాటలనుబట్టి ఆ దారి, తూర్పుగా పోతే తన దేశానికి పోతుందనీ, పడమరగా పోతే రాజకుమార్తె ఉండే నగరానికి పోతుందనీ తెలిసింది.





"రాజకుమార్తెనూ, కొయ్యగుర్రాన్నీ పోగొట్టుకుని ఏ మొహంతో ఇంటికి వెళ్లను? చాతనయితే వాటిని సాధిస్తాను," అనుకుంటూ రాజకుమారుడు పడమరదిక్కుగా నడక సాగించాడు.

వాడు కొంతదూరం వెళ్ళేసరికి ఒక పెద్ద ప్రయాణీకుల దండు గుర్రాలెక్కి వస్తూ వాణ్ణి అందుకున్నది. అందరివద్దా ఆయుధాలున్నాయి. గుర్రాలు చక్కగా ముస్తాబు చేసి ఉన్నాయి. అంతా చూస్తే ఒక బ్రహ్మాండమైన ఊరేగింపులాగున్నది. ఈ ఊరేగింపు నడిమధ్యను ఒక రాజోచితమైన వాహనం ఉన్నది. దానికి అద్దాల కిటికీలున్నాయి, బంగారు నగిషీ అలంకరణలున్నాయి. నాలుగు ఉత్తమాశ్వాలు బండిని లాగుతున్నాయి. వాటిపైన సిల్కు, ముఖ్మల్ గుడ్డలు వేసి ఉన్నాయి.

ఈ ఊరేగింపును దాటిపోనిచ్చే ఉద్దేశంతో రాజకుమారుడు రహదారికి ఒక పక్కగా తొలిగి నుంచుని చూడసాగాడు. తలపని తలంపుగా ఆ బండి రాజకుమారుడికి అంతదూరంలోకి వచ్చి ఆగిపోయింది. అందులోనుంచి ఒక మనిషి దిగి, రాజకుమారుడి వద్దకు వచ్చి, "ఏమి అమ్ముతున్నావు?" అని అడిగాడు.

"నేనేమీ అమ్మటంలేదే!" అన్నాడు రాజకుమారుడు ఆశ్చర్యంతో.

ఆ మనిషి రాజకుమారుడి చేతిలోని బుట్టకేసి చూపిస్తూ, "అవి ఫలాలు కావా? మా యువరాజు చాలాదూరం ప్రయాణమై వస్తున్నారు. వారికి చాలా దాహంగా ఉన్నది. ఆకలి వేస్తున్నది. దయచేసి కొన్ని పళ్ళు మాకు అమ్ము," అన్నాడు.

"అవి అమ్మకానికి కాదు, నేను తినటానికి. ఈ దారివెంట మీకు గరిక అయినా కనబడిందా? నేను చాలాదూరం వెళ్లవలసిన వాణ్ణి. ఈ పళ్ళు మీకు అమ్మి నేనేం తినేది?" అని రాజకుమారుడు అడిగాడు.

ఈలోపల యువరాజు బండిలో నుంచి తన మనిషిని త్వరగా రమ్మని కేకపెట్టాడు. ఆ తరవాత అతను మరొక మనిషికి ఒక బంగారు కాను ఇచ్చి, "ఆ కుర్రవాడు అడిగినంత ఇచ్చి పళ్ళు పట్టుకుని త్వరగా రా," అని చెప్పాడు.

రాజకుమారుడు మొదట వచ్చినవాణ్ణి, "మీరంతా ఎక్కడికి ప్రయాణం?" అని అడిగాడు.

"మా యువరాజు ఫలాని నగరం రాజకుమార్తెను పెళ్ళాడబోతున్నాడు," అని ఆ మనిషి సమాధానమిచ్చాడు, పడమటగా చెయ్యి చూపుతూ.

రాజకుమారుడు నిర్ఘాంతపోయాడు. కాని వాడు తన ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చి మరికొన్ని వివరాలు అడిగాడు. ఈ యువరాజు పెళ్ళాడబోతున్నది తన ప్రియురాలినేనని రూఢి అయింది. వాడు బంగారుకాను తీసుకుని పెద్ద పెద్దవిగా ఉన్న రెండు ఎర్ర పళ్ళూ, రెండు పచ్చ పళ్ళూ ఏరి యువరాజు పంపిన వాడికి ఇచ్చాడు.

యువరాజు వాటిని ఆత్రంగానూ, సంతోషంగానూ తినేశాడు. వెంటనే అతనికి నిద్ర వచ్చేసింది. యువరాజు బండితోసహా పరివారం ముందుకు సాగిపోయారు. కొంతసేపటికి యువరాజు నిద్ర మేలుకుని కంగారుగా అరవసాగాడు. ఏంజరిగిందోనని అతని మంత్రులు పరిగెత్తుకుంటూ బండిని సమీపించారు. కాని వారికి బండిలో యువరాజు కనిపించలేదు — రెండు కొమ్ములూ, మూరెడు బారుగల తెల్లటి గడ్డమూ గల వింత మృగం ఏదో కనిపించింది!

యువరాజుకు పెద్ద ప్రమాదం జరిగిందనీ, పళ్ళు అమ్మిన కుర్రవాడే ఇందుకు కారణం అయి ఉంటాడనీ ఊహించి మంత్రులు ఊరేగింపు నిలుపుచేసి, రాజకుమారుడు వచ్చి కలుసుకోవటానికి ఎదురు చూశారు. —(ముగింపు వచ్చే సంచికలో)





"ఉద్యోగంలో చేరి ఆర్నెల్లవుతోంది. డబ్బాలోంచి ఉత్తరాలు తియ్యడం ఇంకా ఎప్పటికి నేర్చుకుంటావు?"



"హరి మీ! మా అక్కయ్యకి ఇరవయ్యేళ్లని చెప్పిందా! దానికి ఐదేళ్లదాకా, అంకెలు రావుగదా. అందుకనీ ఇరవై అంది. చాక్లెట్టివ్వండి మరి!"



"మరేమో, తమ్ముడేమో అచ్చు అమ్మ పోలికేనని అందరూ అంటున్నారు. అందుకనేమో, నాన్నకేమో కోపం వచ్చి, తనలాగే తమ్ముడికి మీసాలు అంటించేశాడు."



అమ్మాయి :- ఓ కాణీకి బుడగ ఇయ్యవోయ్.

అబ్బాయి :- ఓ కాణీకి గుండు సూదులు ఇయ్యవోయ్.

—ఎస్. శంకరనారాయణ, మద్రాసు.



# మహాకవి భారవి

సంస్కృత కవులలో అనేకమంది ప్రసిద్ధి కెక్కారు. వారిలో భారవి ఒకడు. ఈయనను గురించి ఒక కథ ఉన్నది.

భారవి తండ్రి భవానీభట్టు గొప్ప పండితుడు. అందుచేత ఆయన ,తన కొడుకును కూడా పండితుడుగాచేశాడు. ఇరవైయ్యేళ్ళు వచ్చేసరికి భారవి ఉద్దండ పండితుడుగా తయారయాడు; తండ్రినికూడా మించిపోయాడు. అయినా విద్వాంసులు భారవిని మెచ్చుకుంటూ ఉంటే భవానీభట్టు విని ఊరుకోక, "వాడు పసివాడు, వాడికి నిజంగా ఏమీ రాదు. వాడిపై అభిమానంతో మీరు అలా అంటున్నారు," అనేవాడు.

తండ్రి ఇలా తనను తేలికచేసి మాట్లాడినప్పుడల్లా భారవికి కష్టంతోచేది, తండ్రిపైన పట్టరాని ఆగ్రహంకూడా వచ్చేది.

ఇలా ఉండగా ఒకనాడు ఒక పండితసభ జరిగింది. ఆ సభలో జరిగిన చర్చలలో భారవి కొమ్ములు తిరిగిన విద్వాంసులను సయితం తన వాదంతో ఓడించాడు. సభలో అందరూ భారవిని మెచ్చుకున్నారు. భవానీభట్టు లోపల సంతోషం పొందుతూకూడా, పైకి తన అలవాటు ప్రకారం ఇతరుల ప్రశంసలకు అడ్డుపుల్లలు వేశాడు.

తన తండ్రి మాటలతో భారవికి నిరుత్సాహమూ, అవమానమూ, రోషమూ కలిగాయి. అతను సభనుంచి ఇంటికి వెళుతూనే తన తల్లితో, "అమ్మా, నాయన నా ఖ్యాతిచూసి ఓర్వలేకుండా ఉన్నాడు. నన్ను మెచ్చుకునే వారిని కూడా నిరుత్సాహపరుస్తూ నాకు తలవంపులు కలిగిస్తున్నాడు. ఇకమీద నేనిది సహించలేను, ఎక్కడికైనా వెళ్ళిపోతాను. నువ్వైనా ఆయనతో కాస్త చెప్పిచూడు!" అన్నాడు. మరికొంతసేపటికి భవానీభట్టు ఇల్లు చేరుకున్నాడు. ఆయనతో భార్య తన కొడుకు అన్న మాటకాస్తా చెప్పేసింది.

దుప్పూరి శేషయ్య

అది విని భవానీభట్టు, "మనవాడికి ఈపాటి జ్ఞానంకూడా లేదా? తండ్రి తన కొడుకులను పొగడవచ్చునా? ఇతరులు పొగడుతుంటే విని ఊరుకోరాదుకూడానూ. తండ్రి తన కొడుకును పొగడుకోవటం తనను తాను పొగడుకోవటం వంటిదే. అది కొడుకుయొక్క పురోభివృద్ధికి మంచిది కాదు. ఈ సంగతి వాడికి తెలియదులా గుంది. నీవైనా చెప్పు. వాడు గొప్ప పండితుడనీ, వంశానికి గొప్ప ప్రతిష్ఠ తెస్తాడనీ నాకు మొదటినుంచీ తెలుసు," అన్నాడు భార్యతో.



తండ్రి అన్న ఈ మాటలు భారవి పక్క గదిలోనుంచి విని, పశ్చాత్తాపంతో కుంగిపోయాడు. అతను ఇవతలికి వచ్చి తండ్రి కాళ్ళపైబడి, తన అపరాధం ఒప్పుకుని, తనకేదైనా ప్రాయశ్చిత్తం విధించమని కోరాడు. భవానీభట్టు కొడుకును లేవనెత్తి, "నాయనా, నీవు ఒక ఏడాదిపాటు అత్తవారింట ఉండి రా. అదే ప్రాయశ్చిత్తం!" అని చెప్పాడు.

ఆ ప్రకారమే భారవి అత్తవారింటికి వెళ్ళాడు. ఒక వారంపాటు అత్తవారు అతనికి సమస్త మర్యాదలూ చేశారు. ఆ తరవాత మామగారు అల్లుణ్ణి లౌక్యంగా అతను రావటానికి గల కారణం అడిగాడు.

భారవి ఆయనతో జరిగిన సంగతి చెప్పక, తనకూ తండ్రికీ అభిప్రాయభేదం వచ్చిందనీ, తండ్రి ఇంట ఉండటం ఇష్టం లేక తాను వచ్చేశాననీ అన్నాడు.

అంతటితో అల్లుడి మర్యాదలన్నీ అడుగంటిపోయాయి. బావమరుదులు అతన్ని రోజూ పొలం పనికి తీసుకుపోసాగారు. ఇదంతా తనకు ప్రాయశ్చిత్తమే గనక భారవి వారు చెప్పిన పనులన్నీ చేస్తూవచ్చాడు.

కొంతకాలం గడిచింది. భారవిని అహోరాత్రాలు పొలంమీదనే ఉండి పైరుకు కాపలా కాయమన్నారు. అతని భార్య పొలానికి అతని భోజనం తీసుకుపోతూ ఉండేది.

ఇంతలో శ్రావణమాసం వచ్చింది. భార్య భారవితో, అందరూ నోములు నోచుకుంటున్నారనీ, తనకు కూడా నోచుకోవాలని ఉన్నదనీ, అందుకుగాను తన దగ్గిర డబ్బు లేదనీ కంట తడి పెట్టుకున్నది.

భారవి పొలం కాపలాకాస్తూనే "కిరాతార్జునీయం" అనే ప్రబంధం రాస్తున్నాడు. అందులోనుంచి ఒక తాటిఆకు తీసి భారవి తన భార్యకిస్తూ, "ఈ గ్రామంలో ఫలాని కోమటి విద్వాంసుడు. నేను కవి పండితుణ్ణని ఆయనకు తెలుసు. ఈ శ్లోకం ఆయన వద్ద తాకట్టుపెట్టి నీకు కావలిసిన డబ్బు పుచ్చుకో. ఆ శ్లోకం తాకట్టు విడిపించుకునేదాకా నేను నా కావ్యాన్ని ప్రచురించనని ఆయనతో చెప్పు," అన్నాడు.

భారవి భార్య తన భర్త ఇచ్చిన శ్లోకాన్ని, ఆయన ఘంటాన్ని పట్టుకుపోయి కోమటికిచ్చింది. కోమటి ఆమె చెప్పినదంతా విని, పద్దురాసి ఆమెకు కొంత సొమ్మిచ్చి పంపి, ఆ శ్లోకం గల తాటాకునూ, ఘంటాన్ని ఒక వెదురుగొట్టంలో పెట్టి చూరులో దోపాడు.

తరవాత కొద్దిరోజులకే ఆ కోమటి ఓడ వర్తకంమీద ద్వీపాంతరాలకు బయలుదేరాడు. దారిలో తుఫాను వచ్చింది. ఓడ పగిలిపోయింది. కోమటి చావు తప్పించుకుని ఇంకొక ద్వీపంచేరి నానాఅగచాట్లకూ గుర



యాడు. ఈలోపల భారవి ఎలాగో అత్త వారింట ఏడాది పూర్తిచేసి తరవాత భార్యతో సహా తన ఇంటికి వెళ్లిపోయాడు. కోమటి బాకీ తీర్చి భారవి తన కావ్యం ప్రచురింతామనుకుంటే కోమటి జాడ తెలియరాలేదు. అయన వర్తకాని కని బయలుదేరి పద్దెనిమిదేళ్లు నిండాయి. ఆయన ఎప్పుడో చనిపోయి ఉంటాడని అందరూ అనుకున్నారు. అయినా భారవి తొందరపడక నిశ్చయమైన వార్త తెలిసిన దాకా తన కావ్యాన్ని ప్రచురించకుండా నిలిపి ఉంచటానికి నిశ్చయించాడు. కోమటి ప్రయాణమై వెళ్లిన కొన్ని మాసాలకు ఆయన భార్య ఒక కొడుకును కన్నది. వాడు పద్దెనిమిదేళ్లవాడై ఉండగా కోమటి తిరిగి ఇల్లు చేరుకున్నాడు. "వీడు మన కుమారుడు," అని భార్య తన కొడుకును భర్తకు చూపించింది. తాను బయలుదేరే సమయానికి తన భార్య గర్భవతి అని కూడా కోమటికి తెలియదు.

అందుచేత కోమటి ఆమె శీలాన్ని శంకించి, కోపావేశంలో ఆమెను చంపాలని చుట్టూ చూసేసరికి వెదురు గొట్టంలో ఘంటం కనిపించింది.

దానితో తన భార్యను పొడుద్దామని గొట్టం తీసేసరికి అందులోనుంచి తాటాకు జారి కింద పడింది.



కోమటి ఆ పత్రంలోఉన్న శ్లోకాన్ని ఈ విధంగా చదువుకున్నాడు:

"సహసా విదధీ తనక్రియాం,
అవివేకః పరమాపదాం పదం
వృణుతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః"

తొందరపడి ఏ పనీ చెయ్యరాదనీ, అవివేకంవల్ల ఆపదలు కలుగుతాయనీ, గుణాలనుబట్టే సంపదలు కలుగుతాయనీ, చక్కగా ఆలోచించి ఏ పని అయినా చేసే వాడియందే గుణాలుంటాయనీ ఆ శ్లోకానికి అర్థం. ఈ శ్లోకం కోమటికి మంచి హెచ్చరికలాగా పనిచేసింది. అందుచేత ఆయన తన భార్యపై ఆగ్రహాన్ని నిగ్రహించుకుని, తాపీగా అయినవారందరితోనూ మాట్లాడి, తాను బయలుదేరేనాటికే భార్య గర్భవతిగా ఉన్నదనీ, ఆ కొడుకు తనకు పుట్టినవాడేననీ నిజం తెలుసుకుని, ఆ శ్లోకం తనకు ఎంతో గొప్ప మేలుచేసిందని సంతోషించాడు.

తరవాత, కోమటి దేశాంతరాల నుంచి తిరిగివచ్చిన వార్త భారవికి తెలిసింది. ఆయన డబ్బు తీసుకుని తన శ్లోకాన్ని తాకట్టు వదిలించుకోవటానికి వచ్చాడు.

ఈ శ్లోకం తాకట్టులోఉన్న కారణంగా భారవి ఇన్ని సంవత్సరాలూ తన కావ్యాన్ని ప్రచురించకుండా ఉంచాడని విని కోమటి ఆశ్చర్యపోయాడు. ఆయన భారవితో, "అయ్యా, మీ నిజాయితీ అపూర్వమైనది. ప్రపంచంలో మరెవరూకూడా ఇలా మాటకు కట్టుబడి ఉంటారని నేననుకోను. ఇక మీ బాకీమాట అంటారా? అది నేను ఎలాగూ తీసుకోను. మీ శ్లోకం నా భార్య ప్రాణాలనూ, నా కొడుకు ప్రాణాలనూ కాపాడింది. ఆ శ్లోకానికి విలువ కట్టటం ఎవరితరమూ కాదు," అంటూ జరిగినదంతా చెప్పాడు.

కోమటి తన బాకీసొమ్ము తీసుకోకపోగా భారవికి నూటపదహార్లు బహుమానంకూడా ఇచ్చి సత్కరించి పంపాడు.



# సర్కస్ సింహం

ఒక సర్కస్ సింహం బోనులో నుంచి తప్పించుకుని అడవిలోకి పారిపోయింది. అడవిలో వున్న జంతువులు దాన్ని చూసి ప్రాణభయంతో చెల్లాచెదరు కాసాగినై. సింహం వాటితో, "నేను సర్కస్ సింహాన్ని. మీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. వేటాడే అలవాటు నే నేనాడో మరిచిపోయాను. యజమాని దయతలిచివేస్తే యింత తినేదాన్ని, లేకపోతే పస్తుండేదాన్ని," అన్నది.

సింహం మాటలు విని జంతువులు ధైర్యం తెచ్చుకుని దానిచుట్టూచేరి, "నీకు వేటాడ వలసిన బాధలేకుండా, యజమాని నీ నోటి దగ్గిరకు ఆహారం తెచ్చిపెడుతుంటే, హాయిగా కూర్చొని తినక, ఈ అడవికెందుకు పారిపోయి వచ్చావు?" అని అడిగినై.

"ఓహెూ, మీకు మా యజమాని సంగతి ఏమీ తెలియదులాగుంది. ఆయన మహా క్రూరుడు. నన్ను మంటల్లోకుండా దూకమంటాడు. పీటలూ, పీపాలూ యింత ఎత్తున పేర్చి, వాటిమీదికి కోతిలాగా ఎగిరి కూచోమంటాడు. చెప్పినట్టు చేయకపోయామో, చెర్నాకోలపెట్టి ఒళ్ళు హూనం చేస్తాడు. ఆ చెర్నాకోల ఛెళుక్కుమంటే చాలు, నాకు పైప్రాణాలు పైనే పోతవి," అన్నది సింహం.

సింహాన్ని చూసి జంతువులన్నీ జాలిపడినై. సింహంకూడా ఒక రోజల్లా తక్కిన జంతువులతో కలిసి కట్టుగా కాలక్షేపం చేసింది. కాని మర్నాడు దానికి ఆకలివేయగానే, ఒక లేడిని పట్టుకుని చంపి తృప్తిగా తినేసింది. ఇదిచూసి జంతువులన్నీ వణికిపోసాగాయి. అప్పుడు ఒక ఎలుగుబంటి, తనకు సింహం గుట్టు తెలుసునని చెపుతూ, ఒక చెట్టు ఊడ పెరికి, దాన్ని చెర్నాకోలలా ఛెళుక్ ఛెళుక్ మనిపిస్తూ, సింహం మీదికి పోయింది.

సర్కస్ సింహం చెర్నాకోలను చూస్తూనే, కాలి బలంకొద్దీ ఆ అడవి నుంచి పారిపోయింది.






1. కెప్టెన్ నారాయణరావు, విశాఖపట్టణము

అన్నయ్యా! 'శమంతకమణి' అనే గేయ కథకు చిత్రకారులు ఎవరో తెలుపగోర్తాను. వారికి నా ధన్యవాదములు చెబుతావా?

**"శేషు"—"బాపు" బృందానికి చెందిన ఆర్టిస్టే.**

2. బి. వెంకటుస్వామి స్నేహబృందం, ఊర్లదిన్నె

దాసు వాసులు అన్నదమ్ములా, బావ మరుదులా, స్నేహితులా?

**స్నేహితులు. అందుకే ఎప్పుడూ కలిసి తిరుగుతారు.**

3. జె. నాగేంద్రరావు, ప్రొద్దటూరు

అన్నయ్యా, తాతయ్య కథలు మిక్కిలి సంతోషముగా నున్నవి. ప్రతి సంచిక యందు రెండు కథలు వేయుటకు వీలుపడదా?

**ఒకే సంచికలో రెండు తాతయ్య కథలు పడితే సంతోషం ఏమీ ఉండదు.**

4. కె. సరస్వతమ్మ, సి. ఎం. రాచపల్లి

"జ్వాలాద్వీపం" రచయిత ఎవరు?

**"తోకచుక్క", "మకరదేవత", "ముగ్గురు మాంత్రికులు", "కంచుకోట", "జ్వాలాద్వీపం"—వీటన్నిటినీ రచించినవారు శ్రీ దాసరి సుబ్రహ్మణ్యం.**

5. బి. కె. మధుసూదన్, ధర్మవరం

మహాశయా, మా అనుంగుమాత స్వతంత్రభారతి, మా గారాలమామ "చందమామ"—వీరిలో యెవరు పెద్ద? ఎంతకాలము?

**స్వతంత్రభారతి 1947 ఆగస్టు 15 న జన్మించింది; "చందమామ" 1947 జూన్ 25 న జన్మించింది. అందుచేత "చందమామ" 10 రోజులు తక్కువగా రెండు నెలలు పెద్ద.**

6. వి. యస్. రావు, మీనవిల్లూరు

అందాల "చందమామ"ను 25 తారీఖునకే మా కళ్ల ముందర పడేలా చేస్తే ఎంత బాగుండునో కదా!

మేముకూడా ఆ ప్రయత్నంలోనే ఉన్నాం.

7. బి. నిర్మల, బళ్లారి

"చందమామ" ఎట్లు ముద్రించుకొంటున్నదో చూచుటకు చాలా ముచ్చటగా ఉన్నది. ఈసారి మద్రాసు వచ్చినప్పుడు "చందమామ" ముద్రణాలయం చూడటానికి అనుమతి నిచ్చెదరా?

తప్పక!

8. జి. జయలక్ష్మి, కాకుంట్ల

అన్నయ్యా, నేను చందమామను రెండు సంవత్సరముల నుండి చదువు చున్నాను. నాకు ఒక్క బహుమానముకూడ పంపలేదు, కారణము?

అమ్మాయీ, దాదాపు 14 ఏళ్ల నుంచీ ఇప్పటిదాకా "చందమామ" చదువుతున్న పాఠకులున్నారు. వారి కందరికీ ఏమి బహుమానాలు పంపాము?

9. బి. విజయలక్ష్మి, గుండుగొలను

ఇండియన్ ఇంక్‌తో కార్టూను చిత్రాలు కార్డు మీద వేసి పంపవచ్చునా?

మహరాజుగా!

10. యలమంచిలి రామారావు, వీరంకిలాకు

అన్నయ్యా, బేతాళ కథలను ఇదివరలో పాఠకులను వ్రాయుమని కోరితిరి. కాని రచయిత పేరు దానిపై కనిపించుటలేదు. కారణము తెలియజేయుపలెనని ప్రార్థించుచున్నాను.

బేతాళ కథగా వేసుకోవటానికి పనికివచ్చే కథ ఒక్కటికూడా పాఠకులనుంచి ఇంత వరకు రాలేదు. వచ్చినట్టయితే వారి పేరు సంపాదకీయంలోనైనా ప్రకటించి ఉండేవాళ్లమే.

11. సి. జగదీశ్వర్, చౌటపల్లి

అన్నగారు, 1961 జనవరిలో బేతాళ కథలో 'కల్పితం' అని వ్రాయకపోతిరి, కారణం?

అది కల్పిత బేతాళ కథ కాదు. పాత బేతాళ కథలలో ఉన్నదే.

# అట్టచివరి బొమ్మ

దుర్యోధనుడు శల్యుణ్ణి సమీపించి ఎంతో వినయంతో, "మహానుభావా, కర్ణుడన్న మాట విన్నారుగదా. అతనికి సారథిగా పనిచెయ్యండి," అన్నాడు.

ఈ మాట విని శల్యుడికి మండిపోయింది. ఆయన చేతులు ఆడిస్తూ, "రాజా, ఎందుకు నన్ను అవమానిస్తున్నావు? ఉత్తమ రాజర్షి వంశంలో పుట్టి మహారథుణ్ణి అనిపించుకున్నవాణ్ణి, ఈ సూతుడికి పనిచేస్తానా? ఇలా అవమానిస్తే నే నసలు యుద్ధమే చేయను. సెలవు!" అని చివాలున లేచాడు.

శల్యుణ్ణి దుర్యోధనుడు ఆపి, "మహాత్మా, ఆగ్రహించవద్దు. కర్ణుడు నీకన్న ఎక్కువని నేను అనలేదు. కర్ణుడు అర్జునుణ్ణి మించినవాడైతే, నీవు అశ్వహృదయంలోనూ, భుజబలంలోనూ కృష్ణుణ్ణి ఇంకా మించినవాడవు!" అన్నాడు.

"అలా మాట్లాడితే నేను హర్షిస్తాను. నీవు కోరినట్టయితే నేను కర్ణుడికి సారథిగాకూడా పనిచెయ్యగలను. కాని నేను కర్ణుడి మంచి కోరి ఏమైనా చెబితే అది మీకు నచ్చవచ్చు, నచ్చకపోవచ్చు. నన్ను క్షమించాలి," అన్నాడు శల్యుడు.

తరవాత ఆయన కర్ణుడి రథం ఆయత్తం చేసి తెచ్చాడు.

కర్ణుడు ఉత్సాహంగా శల్యుడితో, "ఏమోయ్, మన రథాన్ని అర్జునుడికేసి పోనియ్యి. ఇప్పుడే అతన్నీ, మిగిలిన పాండవులనూ చంపేస్తాను," అన్నాడు.

"అర్జునుడి గాండీవం చప్పుడు పిడుగుపాటులాగా వినిపించినప్పుడు కూడా ఈమాటే అంటావా?" అని శల్యుడు అడిగాడు.

కర్ణుడి కీమాటలు శూలాలతో పొడిచినట్టుగా ఉన్నాయి. అతను తన యోధులతో, "ఇదుగో వినండి! నాకు అర్జునుణ్ణి ఎవరు చూపిస్తారో వారికి ఎంత ధనం కోరితే అంత ఇస్తాను!" అన్నాడు.

శల్యుడు, "ఓరి పిచ్చివాడా? నీవేం కుబేరుడివా? ఎందుకలా ధనదానం చేస్తావు? ఎవరు చూపకుండానే అర్జునుడు నీకు కనిపిస్తాడు!" అన్నాడు.

"ఓరీ శల్యుడా! నా ఘనత నీబోటి నీచుడికి ఎలా తెలుస్తుంది? అటే మాట్లాడక ఊరుకో!" అన్నాడు కర్ణుడు.

కర్ణుడి రథం కౌరవవ్యూహముఖాన్ని చేరుకున్నది. అవతల పాండవసేన కూడా యుద్ధానికి సిద్ధంగా ఉన్నది. శల్యుడు కర్ణుడికి అర్జునుడి రథం చూపిస్తూ, "అర్జునుణ్ణి చూపమని తెగ అడుగుతుంటివే, అడుగో అర్జునుడు!" అన్నాడు.

# కాల్గేట్‌తో నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే
కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే అపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ వర్తిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనం ఫలితగాము నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేవతనమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఇష్టపడతారు. ఎందుకంటె చాల పేషు ఉండే దాని పిప్పర్ మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పొడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పొడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలదా వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✓ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✓ దంతక్షయమును నిరోధించును
- ✓ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు
ప్రపంచములో ఏ ఇతర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.9-TEL

# ఘారాపూర్ గుహలు

వీటినే "ఎలిఫెంటా గుహలు" అనికూడా అంటారు. ఈ గుహలు బొంబాయికి తూర్పుగా 6, 7 మైళ్ళ దూరాన ఒక లంకలో ఉన్నాయి. ఈ లంకయొక్క దక్షిణపు చివరను ఒక రాతి ఏనుగు ఉండేది, దానిని 1864 లో బొంబాయి చేర్చారు. ఈ రాతి ఏనుగు మూలానే ఈ గుహలకు ఎలిఫెంటా గుహలని పేరు వచ్చింది. (ఎలిఫెంట్ అంటే ఏనుగు) ఇవి 8 వ శతాబ్దంనాటివి.

ఇక్కడ ఎనిమిది గుహలున్నాయి. ఇవన్నీ మానవ నిర్మితాలు. ఇందులో పెద్ద గుహ ప్రధానమైనది. దీని గోడలలో శివసంబంధమైన చెక్కడాలున్నాయి. ఇదే మొదటి గుహ. మిగిలిన ఏడు గుహలలో రెంటిలో చెక్కడాలు పూర్తి కాలేదు. ఈ గుహలలో గల చెక్కడాలలో సుప్రసిద్ధమైనది మహేశమూర్తి. ఇది ఇరవై అడుగుల ఎత్తు.

ఈ చెక్కడాలు సముద్రపు తాకిడికీ, గొడ్ల రాపిడికీ పాడయాయి. పోర్చుగీసు సైనికులు కూడా వీటిని పాడుచేశారు. 1712 లో వారు పెద్ద గుహలోకి ఫిరంగులు పేల్చారట! 1750 ప్రాంతంలో వారు 6 వ గుహను చర్చిగా ఉపయోగించారు.



పువ్వువంటి లలితసుందరమైన
వర్చస్సుకు . . .






MYSORE
Sandal
SOAP

మైసూరు చందన సబ్బు

గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ, బెంగళూరు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1961 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 10-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కడుపు నిండిన తరువాత...

రెండవ ఫోటో: కపోతాలు అదేపోత

పంపినవారు: శింగరాజు హనుమంతరావు,

నాజరుపేట, తెనాలి.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు తోటలో ఆడుకుంటూ వుండగా, గొర్రెలు కాచే కుర్రవాడు, పొదలలో ఒక పాము వున్నదనీ, తనకు మంత్రం వచ్చుగనక, దాన్ని వుత్త చేతులతో పట్టుకుని చంపేస్తాననీ చెప్పాడు. దాసూ వాసూలు భయపడు తూనే పొదల దగ్గిరకు వెళ్ళారు. గొర్రెలు కాచే కుర్రవాడు బూర ఊదుతూ పొదల దగ్గిరకు వెళ్ళేలోపల, 'టైగర్' పొదలలో వున్న పామును తల పట్టుకుని దాసూ వాసూల దగ్గిరకు తెచ్చింది. అది నిజం పాము కాదు. తాడుకు గుడ్డపేలి కలు చుట్టి పామనిచెప్పి, దాసూ వాసూలను గొర్రెలుకాచే కుర్రవాడు భయపెట్టా లని చూశాడు. నిజం బయిట పడగానే దాసూ వాసూలు వాణ్ణి గేలిచేశారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'











'నాలుగు 'వానవెల్లి' రంగులలో వచ్చింది - నాలక్స ... తెలుపులో కూడా!'

అని ఎమ్.ఎస్.రాజమ్ చెప్పుచున్నది



◀ జలుబా?



అమృతాంజనము

◀ కొంచెం రాయండి



◀ వెంటనే గుణం కనిపిస్తుంది




మీకు అమృతాంజనము ఎప్పుడు కావలసివస్తుందో మీకే తెలియదు. ఇంట్లో ఎప్పుడూ ఒక బుడ్డిని ఉంచండి. ఎంతైనా నమ్మకమైనది.

అమృతాంజన్ లిమిటెడ్

14/15, లజ్ చర్చి రోడ్డు, మద్రాసు-4 బొంబాయి-1, కలకత్తా-1, న్యూ ఢిల్లీ-1

JWT-AMJ 1099a

93

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా వుండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-00 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-50 పంపండి. ప్రతికి 12 నయా పైసలు చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



## చందమామ పబ్లికేషన్సు

వడపలని :: మదరాసు - 26

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కపోతాలు అదేపోత

పంపినవారు :
ఎస్. హెచ్. రావు - తెనాలి.

